

శ్రీ అచలగురు శ్రీ సుగుణాకరస్వామి

వెలివేర్తిగ్రామం

# అవతారిక

౧. శ్రీమద్వేదాంతసారంశుును సచ్చిదానందతీతుండును అతీత అచల పరిపూర్ణుండును మహాఅద్వైతశిద్ధాంతప్రతిష్ఠాపనాచార్య్యలగు పండరీపుర నివాసులు పరిపూర్ణబోధామృతు లగు శ్రీ శ్రీధరస్వాములవారు భాగవతమును భగవద్గీతలును యదార్థ అర్థములను గ్రహించి అద్వైతవ్యాఖ్యానమును బృహద్వాశిష్టశిద్ధాంతమును భక్తులకు సులభోపాయముగ తెలియునటుల ప్రకటించి సచ్ఛిష్యుడగు శ్రీ శివరామదీక్షితులకు అచలగురు పీఠాభిషక్తులను చేసిన పండితోత్తములు.

౨. శ్రీమద్రామడుగు వంశపయఃపారావారసుధీరు లగు శ్రీ శివరామదీక్షితులు గురువాజ్ఞప్రకారం అఖండజ్ఞానసంపూర్ణులై జీవన్ముక్తు లగు వీరు శ్రీ సాందీపవాక్యములును దీక్షితీయ మను అచలగ్రంథమును సకలభక్తశ్రేణులకు బహుదూరార్థము సమీపములో అందునటుల ప్రకటించి సంస్కృతంబున వెల్లడిజేసి వారణాశి క్షేత్రమునకు వెళ్లి అక్కడ పండితులు రాజున్ను వీరిని పరీక్షింపదలచి విచారించగా షోడశాక్షరి భావమునే శిద్ధాంతము చేసిరి. వీరు అట్లు జేయగా అధికారి యగు రాజు వీరి శిరస్సు ఛేదించినవారు అయిరి. అట్లు ఛేధించగా వారి శరీరము నుండి ఖడ్గము బయలులో త్రిప్పినట్లు అయ్యి వారి దేహముకు యేమాత్రము గాయము లేక రక్తములేక యీవలనుంచి ఆవలికి వెళ్లిపోవడమే కాని తునుకలు కావటములేదు. తదుపరి వార లందరు విస్మయులై శరణాగతులైరి. వారి అపరాధము క్షమాపణ జేసి తిరిగివచ్చి ప్రియశిష్యుడయిన శ్రీమతు అప్పారావుమంత్రికిన్ని యీ అచల బోధ వెల్లడి చేయుమని అధికారం బొసంగి కేవలాత్ములై యుండిన నారాయణ పురంబున వెలంగుచుండిరి.

3. ప్రకృతి పురుషద్వయ దోషరహితుండును త్రిగుణాతీతుండును క్షరాక్షరోపాధి విలక్షణుండు నగు శ్రీమత్ కంబాలూరపురంబున శ్రీమత్ అప్పారావు తమ గురుకృపాలబ్ధులై స్వగురురచనగ్రంథము లగు శివరామదీక్షితీయ మను అచలగ్రంథంబు యెల్లవారికి చక్కగ బోధపడునటుల ఆంధ్రంబున ప్రకటించి అనేకులను జీవన్ముక్తులను జేసి పరశురామ శీతారాములకు నరశింహదాసుకు అచల గురుపీఠాభిషిక్తుల జేసి అభయంబిచ్చి పరిపూర్ణులై వుండిరి. ఈ నరశింహదాసుగారే భద్రాద్రిరామ శతకమును పరశురామ శీతారామ శతకమును అనేక భక్తి తత్వకృతులు రచించినవారు.

౪. శ్రీమత్ పరశురామ శీతారామస్వాములవారు గురు వనుగ్రహముచేత నిష్ఠాగరిష్ఠులై ఆత్మానాత్మాతీతమైన కేవలాత్మనిష్ఠులై వుండ వీరిని కొంతమంది దుష్టులు పరీక్షించదలచి తినరాని పదార్థములును తాగరాని వస్తువులు తెచ్చి సమర్పించిన అందుకు సందేహింపక గురుప్రసాదము అని సమీపమునకు తెమ్మనిన అట్టి వస్తువులు అన్ని మిఠాయి, లడ్డు, కోవా, పుష్పఫలాదులు మొదలయినవి ఆయెను.

వీరి మహిమ చెప్పదోచక విస్మయులై అందరు భయంబు నొంది శరణాగతులైన వారి ననుగ్రహించినవారైరి. యిదిగాక బాలులకు వృద్ధులకును స్త్రీలు పురుషు లనెడి భావమును యెంచక సర్వసమష్టిభావముగ బోధించి అనేక జీవకోట్లను పవిత్రమును జేసి విదేహకైవల్యములో వున్న మహోత్తములు. వీరు తమ సోదరి యగు శ్రీ శేషమాంబను అంతరంగము శోధించి అంతరంగభక్తికి మెచ్చి అచల బోధ వెళ్లడికి వరంబు లిచ్చి శ్రీమతు భాగవతకృష్ణదాసులకు ఆదేశప్రకారము అధికారం బిచ్చి గోపాలెంలో బట్టబయలై వుండిరి.

౫. శ్రీమతి శేషమాంబ తన గురు కృపాబలముచే అనేక వుపనిషత్తులు వేదవేదాంతశిద్ధాంతంబులు పరిశోధించినదై యథార్థమును తెలసి అనేక తత్వ రహస్యములు కృతిరూపకము బ్రహ్మైక్యబోధ యను గ్రంథంబు ఆంధ్రంబున బాలులకైన తెలియునటుల రచించి అనేక భక్తులకు అచలబోధ పొందుపరచి ముక్తి కరతలామలకము జేసి ముక్తిప్రదాయని అని సాధువులచే కొనియాడబడి తన భక్తులలో నిర్వాహకులైన శ్రీమతు భారేశ్వరు లను మదనూరు గోపాలాచార్యులకు శ్రీ చంద్రమాంబకును బోధాధికారం బొసంగి యేమిటా మీకు భయంబు లేదని వరంబు లిచ్చి మునిదేవుని పల్లెలో సహజమనస్కసమాధిపట్టాభిషిక్తులై పరమపదమైన మహాపెద్దలు.

౬. శ్రీమతు గుమిడెల్లివంశపావనులైన శ్రీమతు భారలింగదేశికేంద్రప్రభువరులు తమ గురువాజ్ఞ జవదాటక తన నాశ్రయించిన భక్తుల కెల్ల లేదనక నచల బోధ బోధించుచు తత్వరహశ్యం బంతయు అంతరంగులకు యెరిగించుచుండెను. వారలకు శ్రీధరుడే అనునట్లు భక్తులకు తోచుచుండెను. వీరలకు ఒకసమయములో అచలగురుపీఠమునకు యెవరు నాభక్తులలో అర్హులైవుంటురో యని తన స్వగురువును ధ్యానించి తెల్పగా వారికి స్వగురు స్వప్నప్రసన్నంబై యీ అచలగురుపీఠమునకు నీ భక్తబృందములలో నొకడైన వెలివేరి అన్నమరాజు రామదాసుడు అర్హుడై వున్నాడని తెల్పి అదృశ్యం బాయెను. అంత వారు అపారవారసంతోషులై వుండి కొన్నిదినములకు రామదాసులను యేకాంతములో పిలిచి తమ గురువాక్యము విన్నవించి అచలబోధ వెళ్లడి చేయుమని అభయం బిచ్చిన నాఅధికారము కాదని భయంబు నొందిన నీవు యెందునను ప్రపంచమాయాభ్రాంతులు అంటక అడవిలో వున్న అయ్యోధ్యయై వర్ధిలుము అని జడియకుమని శిరంబున కరంబు మోపి యీమాట రహస్యములో వుంచుము. గురుమహిమ తనకై తానే వర్ధిలును అని వరం బిచ్చి కొంతవరకు ఆయునతమపరి శోభకృతు నామసంవత్సర జ్యేష్ఠశుద్ధ ౧౦ లు గురువారంరోజున పరమపదమైన బయలులో ఐక్యమైరి.

౭. శ్రీమదన్నమరాజవంశ పయఃపారావారసుధీరు లయిన అనంతం పుత్రుడైన అనంతక్రిష్ణయ్య నిజపత్ని పరమపతివ్రతాశిరోమణి యగు సరస్వతమ్మ గర్భ జనితులు దశపుత్రీపుత్రులను కని వార లందరు మరణించగా సుపుత్రలాభముకై శ్రీఆంజనేయులను ప్రార్థించి భక్తిచేయగా ప్రసన్నులై మూడుఫలములను ఇచ్చిరి.

తదుపరి వారి గర్భమందు ప్రథమం హన్మంతరావు ద్వితీయం అనంతలక్ష్మమ్మయును తృతీయం రామచంద్రరావును జన్మించిరి. వీరి బాల్యదశయందే పితృవు మరణించెను. వీరిని మేనత్తయయిన భాగీరతమ్మ పుత్రవాత్సల్యముతో పెంచుచువుండెను. వీరిలో రామచంద్రరావుకు విద్యాభ్యాసముకై యెంతో వుపలాలనము చేసియు అభ్యసింపుమని తమవారు యెంతగ బుజ్జగించినను వినక పారిపోవుచుండిరి. అంత పదిపన్నెండుసంవత్సరముల ప్రాయమున అక్షరము తెలివి లేనిదే పూర్వజన్మ వాసనావిశేషముననో తత్కాలదైవానుగ్రహముననో రంగశాయినామాంకితముగ సీసపద్యములు వీరి నోటనుండి పలుకబడియె. అందు సారాంశ మేమనిన.

సీ॥ శ్రీరంగనాయక శ్రితకల్పవృక్షమా
 సింధుకరుణానిధే శివనుతాఖ్య
మాధవ మీ నామమంత్రంబు సమకూర్చ
 మరిగి స్మరించెదా మనసునందు
కేశవ గోవింద కృష్ణ దామోదర
 పాశభంజన దేవ పరమపురుష
నారాయణాచ్యుతా నరశింహా నను గావు
 నను గన్నతండ్రివి నప్రమేయ

అనుచు మీ నామ మెప్పుడు అనుదినంబు
తలచుచుండెద నీ కరుణ లోలుక నయ్యె
చారు శ్రీకృష్ణ విష్ణు శ్రీపాదములను
చేరి కొలిచెద రక్షించు రంగశాయి.

యీరీతిగ వారికి తెలియక యెవారి వాక్కునుండియో కొన్ని పల్కబడెను. తదుపరి వీరి స్వప్నమందు ఒక దివ్యపురుషుడు వచ్చి బంగారుముత్యములు చేతులో బెట్టి అయిదుఅక్షరముల మంత్రమును తెల్పి అదృశ్యులైరి. మెల్కొంచి స్వప్నమున మంత్రము యాదికి వచ్చి యెవరికి తెలియజేయక జపించుచుండగా కొన్నిదినములకు హఠాత్తుగా అచలగురుండగు భారలింగదేశికేంద్రప్రభువరులు వెలివేర్తికి విజయంచేసి దర్శన మివ్వగా హనుమంతరావును రామానందులును వీరి జననీసరస్వతమ్మయును పరతత్వముకై ప్రాధేయపడి వేడగా వారు దయాంతఃకరుణులై తారకసాంఖ్యామనస్కంబులు బోధించిరి. గురుపుత్రులు కొందరు వీరికి చిన్నతనము కూడదని అయ్యగారికి తెల్పినను వినక వారి అధ్యవసాయమునకు అచ్చెరువొంది మహాదయానిధులై పరిపూర్ణమును బోధించిరి. దినక్రమేణ అనేక కృతులు పద్యములు శ్లోకములు మొదలయినవి యౌవనప్రాయమువరకే రచించి అనేక దివ్యస్థలములు, శ్రీశైలము, మంగళగిరి, జగన్నాథం, కలకత్తా, కాశీ, గయ, ప్రయాగ, అయోధ్యా, పండరీపురం మొదలైన దివ్యక్షేత్రములు చుట్టివచ్చి తమ గురువాజ్ఞ ప్రకారం సత్యవతిగృహిణీసహితులై వెలివేర్తి మకాములో వుండి తన నాశ్రయించిన భక్తులకు భక్తివైరాగ్యజ్ఞానంబులు తత్వమార్గము బోధించుచు నిష్కలం

క్తులైన అంతరంగులకు అతీతఅచలమార్గము చక్కగా బోధించుచు అనేకుల కృతా
ర్థుల జేయుచు ముముక్షువులకు ముక్తి కరతలామలకముకై భారలింగశతకము, దేశికేంద్ర
శతకము. పరిపూర్ణ గురుసారసంగ్రహము, ప్రకృతి పురుష రహిత కందార్థ దరువులును,
సర్వార్థ నిర్గుణ సీసార్థ దరువులును, గురుపూజావిధి సంస్కృతశ్లోకములును, నిర్గుణ
గురుస్తవ షోడశశ్లోకములును, సాంఖ్యతారక అమనస్కము గల ద్విపదవ్యాఖ్యా
ములును, గురుర్వష్టకములు మొదలయినవి రచించినవారైరి. వీరలకు ఒకసమయములో
అచలగురుపీఠమునకు యెవరు నాభక్తులలో అర్హులైయుందురో యని తన గురువును
ధ్యానించి తెల్పగా వారికి స్వగురు స్వప్నప్రసన్నంబై యీ అచలగురుపీఠమునకు
నీభక్తబృందములలో తమసతియైన సత్యమాంబ అర్హురాలై వున్నదని తెల్పి అదృ
శ్యం బాయెను. అంత వారు అపారవారసంతోషులై వుండి కొన్నిదినములకు
సత్యమాంబను యేకాంతములో బిలిచి తమ గురువాక్యమును విన్నవించి అచల
బోధ వెల్లడి చేయుమని అభయం బిచ్చిన నాజ్ఞాధికారము కాదని భయంబు నొం
దిన నీకు యెందునను ప్రపంచ మాయాభ్రాంతులు అంటక అడవిలో వున్న అయో
ధ్యయై వర్ధిల్లును అని జడియకు మని శిరంబున కరంబునుం మోపి యీమాట
రహస్యములో వుంచుకొనుము. గురుమహిమ తనకు తానై వర్ధిల్లుచుండును. అని
వరం బిచ్చి కొన్నిదినములు జరిగినతర్వాత పరమపదమయిన బయలులో ఐక్యమైరి.

౮. శ్రీమత్ సత్యమాంబగారు తన గురుకృపాలబ్ధముచే అనేక వుపనిషత్తులు
వేదవేదాంతశిద్ధాంతంబులను పరిశోధించినదై యథార్థములను తెలిసి అనేక భక్తి
గల అనేక అధ్యాత్మలను భక్తులకు శుభశైలిగా వుండునటుల రచించి తన నాశ్ర
యించిన భక్తుల కెల్ల సాంఖ్యతారక అమనస్కములను బోధించి తదుపరి అచల
బోధను పొందుపరచి ముక్తి కరతలామలకము సేసి ముక్తిప్రదాయని అని సాధువు
లచే కొనియాడబడినది. తదుపరి వీరు ఒకానొక సమయములో మీ అచలగురు పీఠ
మునకు యెవరు నాభక్తులలో అర్హులై వుందురో యని తన స్వగురువును ధ్యానించి
తెల్పగా వారికి స్వగురు స్వప్నప్రసన్నంబై యీఅచలగురుపీఠమునకు నీభక్తబృం
దములలో నొకడయిన తమబావగారి పుత్రుడగు సుగుణాకరదాసుడు అర్హుడై
వున్నాడని తెల్పి అదృశ్యం బాయెను. అంత వారు అపారవారసంతోషులై వుండి
కొన్నిదినములకు సుగుణాకరదాసులను యేకాంతములో పిలిచి తమగురువాక్యము
లను విన్నవించి అచలబోధ వెల్లడిచేయుమని అభయం బిచ్చి యేమిట నీకు
భయంబు లేదని చెప్పి పండరీపురములో పరమపదమయిన బయలులో ఐక్యమైరి.

౯. శ్రీమత్ అన్నమరాజవంశ పయఃపారావార సుధీరులైన హనుమంత
రావు పుత్రుడైన హనుమంతరావు నిజపత్ని పరమపతివ్రతాశిరోమణి యగు మాణి
క్యమ్మ గర్భజనిత ప్రథమపుత్రుడయిన సుగుణాకరదాసు తమ గురువాజ్ఞ జవదా
టక తన నాశ్రయించిన భక్తుల కెల్ల లేదనక నచలబోధను బోధించుచు తత్వరహ
స్యం బంతయు అంతరంగులకు యెరిగించుచుండెను. వారలకు శ్రీధరుడే యనునట్లు
భక్తులకు తోచుచుండెను. వీరలు అనేక దివ్యక్షేత్రములను చుట్టివచ్చి తమ గురు

# పీఠిక

సత్పురుషులారా కర్నూల్ జిల్లా నందికొట్కూరు తాలూకా మాసాపేట మజరా వుప్పలధడ గ్రామములో నివశించుచుండెడు శ్రీమదార్వేలనియోగి కౌండిన్యసగోత్రం రంగరావుశర్మవంశోద్భవ పయఃపారావారసుధాకరుం డగు కరణము తిమ్మయాఖ్య సతీతిలక మగు నఱసమాంబగారి గర్భజనిత పుత్రత్రయములో ప్రథమపుత్రుండైన శివరామదాసుడు అను నేను శివరామదీక్షిత సాంప్రదాయమండైన అన్నమరాజవంశ భారద్వాజసగోత్ర భాగవతసాంప్రదాయమందు నగు సుగుణాకరస్వామి దేశికేంద్రుల అనుగ్రహమును పొంది అద్వైతభావము నెఱిగి పరిపూర్ణబోధార్థము చక్కగా బడసి కృతార్థుడనై సకల ముముక్షు జనులు కృతార్థులౌటకొరకై శ్రీమదఖండాద్వైత అచలప్రబోధ సుధానిది యను గ్రంథమును ముముక్షువుల కందరకు సులభసాధ్యమగు నని రచించి ప్రకటించితిని.

# విషయసూచిక

# చందాదార్ల పట్టిక.

## కలమందలపాడు గ్రామం

| పేరు | రు. |
|---|---|
| పల్లె రెడ్డి మద్దులేటిరెడ్డి | రు. 50 |
| పల్లె చిన్న మద్దులేటిరెడ్డి | 15 |
| పల్లె రామక్రిష్ణారెడ్డి | 10 |
| దొనపాటి కిష్టారెడ్డి | 0 |
| దొనపాటి నాగిరెడ్డి | 5 |
| దొనపాటి శేషిరెడ్డి | 5 |
| తెలుగు పాపన్న | 15 |
| పల్లి చిన్నతిమ్మారెడ్డి | 10 |
| పల్లి పెద్దతిమ్మారెడ్డి | 10 |
| పెద్దమద్దిగారి తిరుపతిరెడ్డి | 5 |
| పర్వతరెడ్డిగారి తిప్పారెడ్డి | 5 |
| పర్వతరెడ్డిగారి పుల్లారెడ్డి | 5 |
| పల్లి బు॥ తిమ్మారెడ్డి | 5 |
| పింజరి చదువుల గోగారి | 5 |

## మాసాపేట గ్రామం

| పేరు | రు. |
|---|---|
| పి. పుల్లారెడ్డి | 20 |
| వి. రామిరెడ్డి | 20 |
| వి. పెద్దబాలిరెడ్డి | 10 |
| వి. చిన్నబాలిరెడ్డి | 10 |
| పి. నాగిరెడ్డి | 10 |
| పి. రంగారెడ్డి | 5 |
| వి. వుశేనురెడ్డి | 10 |
| వి. రామలక్ష్మిరెడ్డి | 5 |
| చాకలి తిప్పన్న | 20 |

## వుప్పలధడ గ్రామము

| పేరు | రు. |
|---|---|
| కె. పెద్ద శరిబిరెడ్డి | 10 |
| కె. శేషిరెడ్డి | 10 |
| కె. పక్కీరురెడ్డి | 5 |
| తుర్క నబీసాబు | 10 |
| మదారుసాబు | 5 |

## మల్లెం గ్రామం

| పేరు | రు. |
|---|---|
| పడగండ్ల పెద్దపాపయ్య | 5 |
| పాలిమేర రామయ్య | 5 |

## వీపనగండ్ల గ్రామం

| పేరు | రు. |
|---|---|
| కర్ణం నాగరాజు | 5 |
| యస్. వీరేశమయ్య | 5 |
| చంచాపురం రెడ్డి రోశిరెడ్డి | 5 |

## పుసులూరి గ్రామం

| పేరు | రు. |
|---|---|
| పల్లె హనుమంతురెడ్డి | 20 |

## చౌటుకూరు గ్రామం

| పేరు | రు. |
|---|---|
| గంటారెడ్డి శాలిరెడ్డి | 20 |
| బిజ్జుల నాగిరెడ్డి | 5 |
| యం. చిన్న వెంగలరెడ్డి | 5 |

## దిగువపాడు గ్రామం

| పేరు | రు. |
|---|---|
| యం. రెడ్డి వీరారెడ్డి | 10 |
| వి. రాధాక్రిష్ణారెడ్డి | 10 |
| యం. రామిరెడ్డి | 20 |
| పల్లె తిమ్మారెడ్డి | 15 |
| బి. పెద్ద నారాయణరెడ్డి | 10 |
| కె. నాగప్ప | 10 |
| బిజ్జుల శేషిరెడ్డి | 10 |
| యం. వీరారెడ్డి | 5 |
| యం. తిప్పారెడ్డి | 5 |
| వై. చిన్న పుల్లారెడ్డి | 10 |
| మేరెడ్డి గోవిందురెడ్డి | 10 |

## కన్నమడకల గ్రామం

| పేరు | రు. |
|---|---|
| శిద్దిరాజు కేశవరాజు | 5 |

## పైపాలెం గ్రామం

| పేరు | రు. |
|---|---|
| యర్రబోలు పుల్లారెడ్డి | 5 |
| దారసాని శివశంకరరెడ్డి | 5 |

## కడుమూరు గ్రామం

| పేరు | రు. |
|---|---|
| పి. పి. రంగారెడ్డి | 5 |
| శి. శివారెడ్డి | 5 |
| బీరం పెద్ద పుల్లారెడ్డి | 5 |

## నాగలూటి గ్రామం

| పేరు | రు. |
|---|---|
| కరణం వెంకటశేషయ్య | 5 |
| తమిదెల శేషిరెడ్డి | 5 |

## నందికొట్కూరు గ్రామం

| పేరు | రు. |
|---|---|
| అలవాల లక్ష్మమ్మ | 10 |

## రాయచోటి గ్రామం

| పేరు | రు. |
|---|---|
| అమీరుజాన్ | 10 |
| యం. అల్లంబేగ్ | 5 |

## కర్నూలు పట్టణము

| పేరు | రు. |
|---|---|
| ఆజి గులాం హుశేను | 5. |
| జే. గులాబ్ ఖాన్ | 10 |

శ్రీ శివరామదీక్షిత గురవే నమః — శ్రీ మదప్పలార్య గురవే నమః

శ్రీ పరశురామ శీతారామ గురవే నమః

# శ్రీ శేషమాంబగారి కృతులు

## 1 కీర్తన

శరణా జేసెదాను గురురాయా నన్ను - చేపట్టు కరుణాని ధేయా ॥ప॥ నేరాము లెంచాకు స్వామి నిన్ను-నెరనమ్మి యున్నాన దేమి నేను-నీదానాను సుమ్మి-నీ పాదాపద్మములే నమ్మి ॥౧॥ పరులాభారికి నన్ను త్రోయాకు నా-పాపపుణ్యములాను యెంచాకు-పడరాని భాధాల బెట్టాకు యిది-పాతాకు రాలాని యెన్నాకు ॥శ॥౨॥ దండిదాత వాని వింటే నీ కన్నా దైవము లేడంటే నీ దాపు నేను జేరుంటే నీవె-దయవుంచు మని వేడుకుంటే ॥శ॥౩॥ క్షుత్పిపాసల కోర్వజాలా నన్ను-కష్టపెట్టుట నీకు మేలా-నా భాగ్యాము నిన్నాన నేల-భక్త మానాస హృదయాబ్జా లోలా ॥శ॥౪॥ చుట్టాపక్కములా నే బాసితీ నా-చుట్టున్నా వారి విడనాడితి నీవె నా-చుట్టాము వాని మాది నుంచితి ని న్నెంతో నమ్మి ॥శ॥౫॥ నరులాను నమ్మలేదయ్యా నిన్నె-నమ్మితి నా కితరా సోమ్మేల నయ్యా-నన్ను పోషించ నీవే నయ్యా నే-నెన్నెన్నో విధమూలా నమ్మితి నయ్యా ॥శ॥౬॥ నన్నూ రక్షించాక యున్నా-నా తిప్పాలు కల్గు అన్నన్నా-పరులు యీమాటాలు విన్నా వారు పకపక నవ్వేరోయన్నా ॥శ॥౭॥ దేహదారుఢ్యాము బోదా-నే లేవాలేకున్నాను వాదా-నన్ను యిహమందు వుంచీతె మేదా-నీవు యికనుగో రమ్మని పిల్వరాదా ॥శ॥౮॥ సేవాకు రాలాను సుమ్మా-శేషమ్మ జేసిన మనవి-చెవు నుంచుకొమ్మా-శాశ్వత పదవి నా కిమ్మా యీ-శరీరమె నీదాయ సుమ్మి ॥శ॥౯॥ పగలు రాత్రులు ని న్నే మారాను-నీవె పరిపూర్ణ రూపా మని యెదాను-పాతాక హరుడా వని విన్నాను-శీతారాములె గురు డానుకున్నాను ॥శ॥౧౦॥

## 2 కీర్తన

చాలు నమ్మా సంసార సుఖము చాలు నమ్మా-చాలుచాలు సంసార సుఖమూ-మేలు లేదు మీ ననిత్యము-సారెసారెకు గురుని జేరి - సత్యముగ వర్తించవమ్మా ॥చా॥౧॥ వోద్దువోద్దు కుజనుల పొందు రాద్దుగాద్దు-యద్దువలె యెరిగింతలాడెవు - వద్దువద్దని చెప్పగాను కొద్దిగుణములు మాని గురునీ-వద్ద జేరి వుండవమ్మా ॥చా॥౨॥ పొట్ట బోకు పశుల నీ వారని మూట్టబోకూ-వట్టిమాటలు గావు చెప్పెద గట్టిగా చెడిపొయ్యెదవు వినూ-పట్టువిడుపులు లేని వస్తువు దట్టముగ తెలిసుండవమ్మా ॥చా॥౩॥ నిందె లేల పొందెద వూని-అందమూరా సుందరీమణు లందరికినీ - వందనంబులు జేసి నీ మందిరంబున నుండి గురుగో-విందనామము తలచవమ్మా ॥చా॥౪॥ బోటు లెల్లా నవ్వ దురూ-నీ పాటు కెల్లా కోటివిధముల జెప్పినను విన-వేటికీ నీ మదమునీ నోట సద్గురు స్మరణచే ము-మ్మాటికీ తరియించవమ్మా ॥చా॥౫॥ చేష్ట లుడిగీ సద్గురువూల సేవ-జేసి శరణు జేసి పరము జెంది-సేసి చెయ్యని దానవయ్యె శేషమ్మ-జెప్పిన వాక్యమందు శ్రద్ధ చాల వుంచ వమ్మా ॥చా॥౬॥ పంత మేలా పరులకు నీ స్వాతంత్ర్యమేలా - పరి పరివిధములను జెప్పిన-పరువు బాడుచు పొయ్యెదవు నీవు-పరశు రాముల శీతరాముల పాదములు నమ్మితె నీకు ॥చా॥౭॥

## 3 కీర్తన

సద్గూరు రాయుని రమ్మానే-చానానామనపిగ్గె కొమ్మనె ॥ప॥ త్రివిధదీక్షలో నర్చెనె నా-శిరమూపై హస్తము జేర్చెనే ॥స॥౧॥ నోసటా భాసితరేఖ దీర్చెనే సి-నోముఫలమె మం చానెనే ॥స॥౨॥ మూడుమండలమూలు జూపెనె నశ్మి-ముక్తికాంతతో పొందు గల్పెనె ॥స॥౩॥ చిన్ననాటినుంచి వున్నా-నె నేచింత జేయక నే నుండానె ॥స॥౪॥ వాదాభేదము వదాలించెనె ప్రణవ-నాదాము చెవి నాటిం చెనే ॥స॥౫॥ పతితాపావన బీరు దున్నాదే భక్త-పరిపాలన శేషూ రమ్మానె ॥స॥౬॥ యేనుమేడల నెక్కించెనే రెండు-కోడెపాముల

నాశించెనే ॥స॥౭॥ భ్రూమధ్యమున చూపు నిల్పెనె మంచి-పున్న మవెన్నెలలో నుంచెనె ॥స॥౮॥ పాతకముల పారాదోలెనే బట్టా-బయలులో నామంబు నిల్పెనె ॥స॥౯॥ శేషమ్మా మొర వినుమా నావే నీకు-శేషాకురా లాని చెప్పావె ॥స॥౧౦ పరశురాముని శీతా రాముని నన్ను-పాలించినా గూరు దేవ్వాని ॥స॥౧౧॥

## 4 కీర్తన

యెందుకూ యీ దేహమూ గురుమహిమ దెలియని దెందుకూ సందేహమూ-యెందుకూ యీ దేహమూ యిక యెందుకూ యీ మోహ మికనూ-సందుగొందుల నిండియుండిన సమరసైక్యము జెందకున్నది ॥యె॥౧॥ కోటిజన్మము లెత్తి నరగర్భమందున వాటమూగా బూట్టి-కాటుకొపత్నూల కెంటిని మాటు బెట్టి చూచి త్రీ-కూట మధ్యమునందు యుండిన సూటి దెలియా నేరకున్నది ॥యె॥౨॥ వందనంబులు జేసి గురుపాదుకలు తన శిరమునందున మోసీ-నిందె నిందల దగులను మది సందియంబులు మాని బ్రహ్మా-మందు జేరి యుండి పరమానంద మందు జెందకుండిన ॥యె॥౩॥ యెన్ని జెప్పి నగానీ తన మతము విడువాకుండుటా అది యేమిా-యెన్ని విధములనైన పంచావన్నె చిల్కలు చూచి చూచి కన్నులా-యందున్న కాంతిని కలసిమెలసి వుండనేరని ॥యె॥౪॥ మండలావధ్యామునా యుండీన యా కుండలీపై నున్నా-మెండమావుల తీగెమెరుపుల దండిగా గను గొనుచు బహుగా-నుండవని నీ మదికి దెలసియు పండువెన్నెల జూడకుండిన ॥యె॥౫॥ చెవిన యిల్లూ గాట్టి చెప్పేను శేషమ్మ చెప్పిన సూటీ మాటిమాటికి చూచి చుక్కలకోటి సూర్యాచంద్ర దన్వ్యలు గోట మిాటుచు దాటిపొవ్వ్యే బాట దెలియా నేరకున్నది ॥యె॥౬॥ పరశూరామునీ పరమయిన శీతారాములే గురుడాసి - పరమహంసా రూపమయ్యి బయలులో విహరించుచూ మతి-పరవశంబై పరమ

## 5 కీర్తన

సద్గురు సేవకు రండీ మీరు సర్వము బ్రహ్మ మనండీ-సాధుల సేవించండీ మీరు సంతోషము నుండండీ ॥౧॥ అంగడి బేరం బనుటా యీ దేహము వుండదని వినుటా-గురుస్మరణ జేయ్యు నీనోటా దురితములు జోర విచ్చోటా ॥౨॥ మలమూత్రంబుల గుంటా మాంస రక్తముల పెంటా దీని-మమత విడిచి నీ వుంటా నీవు మరలబుట్ట విగ వెంటా ॥స॥3॥ అష్టపాశముల బట్టి అరిషడ్వర్గము గొట్టి యివి-వట్టి వనుచు మనసు బుట్టీ నీకు బట్టబయలె మరి గట్టీ ॥స॥౪॥ పంచ కోశంబుల జుట్టి మీరు పంచేంద్రియములను నెట్టి - పరిపూర్ణము చేపట్టీ యీ పాపములను పడగొట్టి ॥స॥౫॥ పరమభక్తి మీ కుండి ఆ పరమపదము దెలిసుండీ-శీతారాములె గురువను చుండీ నీవు స్థిర మానసమున నుండీ ॥స॥౬॥

## 6 కీర్తన

యేమనందు సద్గురు మహిమా యెంతాని కందూ అంతా యింత యాని వివరింతా మంటే మంతానమునకూ నా మనసే మొ లేదాయ ॥ప॥ యన్నాగ రాదు వేడుక మీరి యున్నాదిగాదు -- యె న్నెన్నో జన్మము లెత్తాగ గురు జేరి పన్నాగ నేటికి పరిశుద్ధా మై తిని ॥యే॥౧॥ చూడాగరాదు చూపులోన రూపాము లేదు-చూపూ రుపూ లేని సూత్రాము దెలసితె పాపామె లేదాయ పరమాపాదం బాయె ॥యె॥౨॥ తత్పదము గాదూ తానసే హంఘాత్వం పదము లేదు-అసిపాద మనియేటి ఐక్యాభావము గాదు అన్ని దేశములందు ఆవారించిన మహిమ ॥యె॥3॥ నేనేమి లేదు నీవనె మాట నిల్వాగ రాదు-నీవూ నేను లేని నిజభావ మెరిగితె నిర్వికల్ప మాయ నిగమా గోచర మాయ॥యే॥౪॥ పలుకాగ రాదు పరిపూర్ణమై బాధయు లేదు- పరశురాముల శీతారామూల రూపాము - బయలం ద్వైక్యామాయ భావాభావ మాయ॥యే॥౫

## 7 కీర్తన

నమశ్శివా యనవే దేహము నమ్మరాదుగదవే-బొమ్మలలోని యెమ్మెక జూచి నమ్మికై నదిగదవే॥ప॥ శివపంచాక్షరి మంత్రము లోను శివుడున్నా డనవే – శివ జీవైక్యసంధానము దెలసితె శివశివ శివశివ శివాశివా యని ॥౧॥ నళిన హిరణ్యాగర్భములోను హరుడున్నా డనవే-అదే నీవారశూకాగ్రం బనుచును హరహర హర హర హరాహరా యని ॥న॥౨॥ అంగములోపల లింగరూపమై పొంగుచు నున్నాడే – అంగస్థానము జంగం బెరిగితె లింగలింగ శివ లింగా యనియును ॥న॥3॥ పంకజముఖరో పరాత్పరుం డట శంకరుడున్నాడె – చక్కని గుహలో సాక్షిరూపమై దిక్కుదిక్కు నాల్దిక్కుల చూచుచు ॥న॥౪॥ మనసులలోనె మాయరూపమై మర్మము గలవాడె-మనుచే అత డని మర్మము దెలసితె మహాదేవ మహాదేవ మహాదేవా యని ॥న॥౫॥ కనుగొంటీనని కన్నులయందున ఘనుడున్నా డనవే – కనుల జూచితె కీలకమంతయు ఘంటానాదము గణగణ మ్రోయగ ॥న॥౬॥ శేవ్యమతము యీలాగు యనుచు శేషమ్మ జెప్పెగదవె – శరీరమందున్నా శానను దెలసితె శంభోశంభో శివ శంభో యని ॥న॥౭॥ పరశురామ శీతారాములు యీపద్ధతి దెల్పెగదె-బాగుగ వీటితో పని యేమనుచును బయలులోన నిర్భయులు జూడు మనె ॥న॥౮॥

## 8 కీర్తన

నమ్మరాదుగదవే నీ మాటలు నమ్మిక లీల పోవె-వన్నెలు చిన్నెలు యేల జేసెదవు నేను గురుని సొమ్మైతిని నేజెల్ల ॥న॥౧॥ బ్రహ్మ విష్ణాదులనూ రుద్రుని పరగ దేవతలనూ – బ్రొద్దుబోక నీవు పోట్లాట పెట్టితివి హద్దు లేదుగదవే నేజెల్లా ॥న॥౨॥ పరాశర్యులానూ పుత్రుని వ్యాస వశిష్టులనూ-గాసి పెట్టెదవు ఘుడియ ఘుడియకు మోసపుచ్చితి గదవె నేజెల్లా ॥న॥3॥ ధర్మరాజులాను అర్జున భీమ నకుల సహదేవులాను అత డడిగిన రాజ్యం బిమ్మనకుండెను అడవికి

బొమ్మంటివిగదవె నేజెల్లా ॥న॥౪॥ పరమమునీంద్రులనూ జ్ఞానుల పరమభక్తులానూ-యిలమీద జనులను విసువక నీవు వారి సొమ్మొగి నీ నేజెల్లా ॥న॥౫॥ మాయలో మాయవి వే నీ మహిమలు మరువ రాదుకదవె - సాధుల నైనను చంకబెట్టుకొని సహాస మున్నది చాలుచాలు పోవె ॥న॥౬॥ పశువులు శౌరిని వే నీవు నన్ను భయము పెట్టక పోవె - పరశురాముల శీతారాములా పాదరక్షలతో పడ గొట్టెదను ॥న॥౭॥

## 9 కీర్తన

తారకనామము దలచితె ముక్తి దగ్గర వున్నాదీ-తారకనామము తలువని వారికి తరమే నన్నాదీ ॥ప॥ మోక్షము కావలె నన్న వారికీ మోక్షము లిచ్చినదీ - కుక్షిలోపలా మర్మము దెలిసితె గూఢమై వున్నాదీ అంత-ర్లక్ష్యము చూచినవారికి రమ్యం బైనాది-నిక్షేపం బె నమ్మినవారికి రక్షక మైనాది ॥తా॥౧॥ కామము కోరినవారికి నెల్లా కామము లొసగినదీ - కామక్రోధ గుణంబులు విడచిన కనుపడు చున్నాది-నేమకర్మము లేక జగంబున నిండుకయున్నాది-నామరూపము లేక చూచితె రమ్యం బైనాది ॥తా॥౨॥ అర్థము కావలె నన్న వారికి అర్థము లిచ్చినదీ మంత్రా - శిద్ధికొరకూనై జపము చేసితె శిద్ధం బైనాదీ చి-హ్నమ్ములు పట్టి చూచినవారికి శిద్ధం బైనాదీ - బుద్ధిమంతులై కనుగొంటేను పరిపూర్ణం బైనాదీ ॥తా॥౩॥ పంచభూత ప్రాపంచం బంతా పరువం బున్నాదీ-సంచిత కర్మము లన్నియు బట్టి దృంచివేసినాది - కొంచ మనక గురుసూత్రము తోడుత గొప్పయి వున్నాదీ నియ-మించియు ధ్యానించినవారికి నిర్మల మైనాది॥తా॥౪॥ శరణనె వారిని కరుణించెద నని-బిరుదు వేసినాదీ సేవ జేసి గురు భజన జేసితె-శ్రేష్టం డన్నాది చెడిపోకను రామనామము దలచితె శాశ్వత మన్నాది శేషమ్మ జెప్పినా వాక్యము లన్నీ చెవి జొర మన్నాదీ ॥తా॥౫॥ పరిపరివిధముల ప్రస్తుతి జేసితె పరమై వున్నాది-పరశురాములా వారి నోటను పలుకుచు నున్నాది - శిరులు సంపద

లోనగెద ననుచును శిద్ధం బై నాదీ-శీతారాములు నాకు జెప్పితే స్థిరమై యున్నాదీ ॥౬॥ తా॥

## 10 కీర్తన

సర్వసూన్యమే బ్రహ్మం బనుచూ చాటుచుండురోరి-సర్వ ప్రపంచము మాయ యని దాని సంధి దెలియరోరి॥స॥౧॥ దశావతారా లనేటిమాటలు వృత్తవి కదరోరి-దనరు మునుల ఋష్యాదు లందరి జాడ లేమరోరి॥స॥౨॥ బ్రహ్మాదేవేంద్రాది ప్రభృతులు అంతా ప్రకృతి పురుషులోరి-ప్రకృతికి పరమై వున్నది వస్తువ ప్రేమతో గనరోరి॥స॥౩॥ యక్కడ చూచిన ఒక్కటై వున్నది వేరు లేదు రోరి-వెలిలో లోపల వెలుగుచు వున్నది వేరు లేదురోరి॥స॥౪॥ పలుకుల కందక భావము నంటక పర మున్నదిరోరి-పరమానందము పరమానందము జెందియు నీవుచు బయలు దెలియరోరి॥స॥౫॥ పరశు రామ శీతారాములు మన పాలిట గలరోరి-బాగుగ జెప్పినవి వినక పరము నొరుకదోరి॥స॥౬॥

## 11 కీర్తన

బ్రహ్మ మనరా భ్రాంతి విడరా పార-బ్రహ్మ మనరా భ్రాంతి విడరా-అజ్ఞాన మనె తిమిరా మంటాకుండియు నీవు-ప్రజ్ఞానం బ్రహ్మ మాని పలుకుచుండరా॥౧॥బ్ర॥ ఆహమానె పత్తి విడచి ఆరింటి నంటాక-అహంబ్రహ్మ శ్మాని ఆనందించుమురా॥౨॥బ్ర॥ తత్వాద మని యేటి తాత్పర్యమంతా దెలిసి తత్వామసియాని తలచూచుండారా ॥బ్ర॥౩॥ అయిదయిదులు యిరువై అయిదింటి మీరున్న-అయమాత్మ బ్రహ్మమానె అచలామృతం గ్రోలరా॥బ్ర॥౪॥ పరశు రాములు శీతారాములే గురుడాని-పరగ శేషమ్మ జెప్పిన భావమే నిజ మనరా॥బ్ర॥౫॥

## 12 కీర్తన

మనసా నా మాటయు వినవే నీవు నా మనవియూ చేకొనవే-మనసా నా మాట విను మనవియు చేకొను-మరువాక గురుమంత్రా

మనసా కాయవె నీవు ॥౧॥మ॥ మదమూను విడచియుండావె గురు చరణాములందూ నిల్పావె - మరణ మయ్యేవేళ మరుపు దాగులు నేమో మరువాక గురు స్మరణా మరిమూరి కాయావె ॥౨॥మ॥ వాదభేధము లేలనె నాదము వీని మోాద మొందారాదే - వదలాక గురుసేవ ఒప్పుగా జేయుచు - విదితాముగా గురునీ వినుతీ జేయవె నీవు ॥మ॥౩॥ తల్లితండ్రు లెవరే వోమనసా యీా దారపుత్రాదులు యెవరే-తనువూ నిత్యా మూని ధనమూ కాశించేవు-తల్లి పోయ్యే వేళ తనవెంటా రాబోదు ॥మ॥౪॥ పరుగు బారక వుండావే యీా పాపాసంసారము విడచి యుండావె-పరిపూర్ణ బోధ దెలసి పరమా నందము జెంది-పరశురాముల శీతారామూాల దలువావె ॥మ॥౫॥

## 13 కీర్తన

ఆనందమాయా నామన సెంతో అతిమోదమాయ - ఆనంద మాయను యేఅందమును బాయ సచ్చి-దానందామును సంపూర్ణ మాయెను ॥ఆ॥౧॥ త్రిగుణములు బాయా దినదినము పాచి దీసి నట్లాయ-తీరైన మనసందు తిరుగాక పాయాను తియ్యాని మామిాడి పండూ తిన్నట్లాయను ॥ఆ॥౨॥ అన్నాది బాయా అల్పమనేది వీడీ పోయ-అనుదినము గురుసేవ అనుకూలమాయాను-అమృతాపానము నాకు అనుభావమాయెను ॥ఆ॥౩॥ కన్నాది బాయా కామక్రోధ ములు కడకేగి పోయా - కలలో వస్తువ లన్ని కానారాదాయెను కదళీఫాలంబును కబళించి నట్లాయ ॥ఆ॥౪॥ అంతా తానాయా ప్రాపంచము యెంతో వింతాయా - అంతారంగమునందు సంతోష మాయెను ఆనందా వారిలో మునుగాడమాయెను ॥ఆ॥౫॥ పాపాను పాయూ పరశురాముని శీతారాముల నమ్మి ప్రేమాతో శేషమ్మా - జెప్పినవాక్యాము పంచదార తేనె మించినట్లాయను ॥అ॥౬॥

## 14 కీర్తన

చప్పారాని మానిపండూ అది చెప్పితె జనులాకు తెలివై యుండూ పంచాభూతములకు మించీ యున్నది పండూ సంచీతఖర్మ

ముల దృంచి వేసిన పండు-పంచాక్షరీమంత్రం పై నాయున్నది పండు పరమహంభక్తులాకు పరిపూర్ణ మైయ్యుండు ॥చ॥౧॥ నాదబిందుకాళ లంటాకుండిన పండు - వాదాభేదమూల వదలించిన పండు - క్రోధా గుణంబులా కొట్టివేసిన పండు-సాధుసజ్జనులాకు సంపూర్ణ మైవుండు ॥చ॥౨॥ అరిషడ్వర్గము లాశ అణచీన పండు - అరసి త్రిగుణ ములాను పెరికివేసిన పండు-ఆశపాశమూల కోసివేసిన పండు-దాసు లైనవారి దగ్గారనే వుండు ॥చ॥౩॥ స్థూలసూక్ష్మ కారణాల మీాది పండు-తుర్యాతీతమయి సుషుప్తి జెందని పండు-సురులా కాభేద్యామై చూడరాని పండు - ఆర్యాలైనవారి కానందమై వుండు ॥చ॥౪॥ అయిదువర్ణమూల కావాలి దాపుండు-హరిహరాదులాకు అలవిగాని పండు-అన్నరామబ్రహ్మాం అనుభావించిన పండు-అతిగా శేషమ్మాకు అనుకూలమై వుండు ॥చ॥౫॥

## 15 కీర్తన

సర్వాశూన్యామె బ్రహ్మామయ్యా వోశిష్య నీకు - సర్వా శూన్యామె బ్రహ్మామయ్యా ॥ప॥ సర్వాశూన్యామె బ్రహ్మాం అరమూరలేక వున్నది - సరసాముగాను జూచితె సొజ్ఞాచె తెలియ వయ్యా ॥స॥౧॥ మూడుగుణామూలు బామరయ్యా ఆమీాదనున్నా-మూడూవాసనలు బాయూనయ్యా - మూతేనమూ వున్నా ముక్తి కాం తే మూమూ-మూలాము లేని శరీరామె మీాదావునయ్యా ॥స॥౨॥ ఆరూశత్రూల నణచావయ్యా నీలోన వున్నా-ఆరుచక్రములు దాటా వయ్యా మేరుశిఖరామం దున్నా మ్యాడామీాదికి నెక్కి- మీాదు క్రింద చూచితె మిళితామై వుండునయ్యా ॥స॥౩॥ అంటిఅంటాక వున్నాదయ్యా ఆరూపమయ్యా-కంటీకి వెలిగా నున్నదయ్యా-యింటికి లోగా కంటీకి వెలిగాను - జంటూ బాయాక వెనువెంటా నంటున్నా దయ్యా-॥స॥౪॥ పుట్టుచావులు లేని దయ్యా యీామాటలన్ని - పట్టిని గావూ చూడావయ్యా - యిట్టిమాటాలు మున్ను యెవ్వారు జెప్ప లేదయ్యా-గుట్టు బామాలు అయినా పొట్టాలో నుంచావయ్యా॥స॥౫॥ పగలురాత్రూలు లేనిదయ్యా పరిపూర్ణామయ్యి - బాధాలేమీాయు లేనీదయ్యా-సాధూలదగ్గేరసంపూర్ణమైనాదయ్యా-ఖేదాభేదాములాను

ఛేదించి వున్నదయ్యా ॥స॥౬॥ రేపూమాపూలు లేనిదయ్యా అపారా బ్రహ్మము-పాపాలో దాపూ అయినాదయ్యా - ప్రాపూ దాపూను లేకా కోపాతాపాము లేక-యేప్రొద్దు జూచినాను యేకామై వున్న దయ్యా ॥స॥౭॥ బయలే భావాన సేయారయ్యా-బయలూలో బయలై పరమానందాము జెందావయ్యా - యిట్టిదీ అని దాన్ని వర్ణింపారానీ దయ్యా - అట్టీ వస్తూవ జనులా కగుపడకా వున్నదయ్యా ॥స॥౮॥ ఎరుకామరుపులు లేనిదయ్యా ఆ - పరబ్రహ్మము యెప్పాటివలె వున్నా దయ్యా - గొప్పా కొంచాముగాక కోరి కేమీయు లేక-తప్పువప్పూలు లేక దగ్గారవున్నాదయ్యా ॥స॥౯॥ యిందందు అనకా వున్నాదయ్యా - సందూగొందూలా సమారాస మయ్యీయున్నాదయ్యా-నిందానిందాలు లేక పొందూ ఏమీయు లేక - యెందెందు చూచిన నీ కందందే వున్నాదయ్యా॥స॥౧౦॥ శాయారాని పనులూ శాయాకయ్యా సద్గురునీ జేరి - సేవా జేసి పరమా నొందావయ్యా నా చెల్లెలైన - శేషమ్మ జెప్పిన భావ మంత చెవినాటి వినవయ్యా - శ్రేష్టూడవు నీ వవుదువయ్యా. ॥స॥౧౧॥

## 16 మంగళహారతి కీర్తన

మంగాళ మని పాడరమ్మా - మంగాళ మనరే మీా మనసు చెలించాక పొంగూచు భ్రూమధ్యంబూననుండీ ॥మం॥ పంచవింశతి తత్వామనె పళ్లెములోన పంచెవన్నెలు దీర్చి-అంచితంబుగ బోధాంత మందు వెలిగించె నాగురు కాని వంచాన లేకాను ॥మ॥౧॥ మూడు మండలమూలూ దాటుచు కుండాలీ పైని పండూ వెన్నెల జూచుచూ - అండపిండబ్రహ్మాండభాండమూల నిండీ వెలుంగుచు నుండీన గురు నాకు ॥మ॥౨॥ మంటిమింటికి సందుమార్గాము ఎరిగీయు కంటీలోపల వున్న-వంటీదెలసి దా నంటాక పరమై ఘంటానాదము ఘణఘణా మ్రోయగ ॥మ॥౩॥ బయలే భావన జేయుచూ బయలూలో బయలై పరమానందమూను జెందుచు - పరశురామవర శీతారామయ్యాను పరిపరివిధమూల ప్రస్తూతి జేయూచు ॥స॥౪॥

శ్రీ పరశురామ శీతారామ నరశిహ్మదాసు సోదరియగు శేషమాంబ విరచిత పరతత్వములు సంపూర్ణము

హరిఃఓం

శ్రీ శేషమాంబ ప్రియశిష్యు డగు

# శ్రీ ఖారలింగస్వామి విరచిత పరతత్వములు

## 1 కీర్తన

మంచిగురుడు దొరికె నాకు మర్మము దెల్పెనే నా-సంచితా
ఖర్మముల బట్టి ద్రుంచివేసెనే ॥మ॥౧॥ పంచాక్షరి తెల్పి పాటించు
మానెనె దీనికి-మించినా బ్రహ్మైక్యమూను గాంచుమానెనె ॥మ॥౨॥
తారకమంత్రాముతో తరియించుమానేనే యీ - సారములేని
సంసారము వీడుమానెనె॥మ॥3॥ హంసతారకంబు దెల్పి ఆదరించెనే
నా- అంతరంగమందు హంస వింత దెల్పెనె ॥మ॥౪॥ వేదవాక్య
మూల అర్థం యరుక జేసెనె యీ-నాదబిందుకళలో వినోదము జూపెనే
॥మ॥౫॥ మూలా మేమి లేనిదనుచూ షోడశి తెల్పెనే యిదియు-
జాలమూతో నైన యింద్రజాల మనియెనె ॥మ॥౬॥ ద్వాదశాక్షరి
జెప్పి చక్కని త్రోవ జూపెనే యీ - దారికంటె ఎక్కువ రాజదారి
లేదనెనె ॥మ॥౭॥ పరిపూర్ణ మనియె భావము బయలు అనెనె యీ-
పరమా శేషమ్మ భజనా శాయ గల్గెనే ॥మ॥౮॥



## 2 కీర్తన

యిందులోపల జేర నందామైనావె ఘట-మందులోపల జేరా
నందామైనావె-అందామైనావె ఆనందమైనావె బ్రహ్మానందమైనావె
॥౧॥ యిహపారా సౌఖ్యములు యిచ్ఛాయించాకె-ఆహం భావము
మాని అచలా మొందావె ॥యి॥౨ ముదమొప్పు శాంభావి ముద్రా
జూడావె-ముద్రలోన సద్గురు మూర్తి వున్నాడె ॥యి॥3॥ సంతోష
పడి జగమంతా జూచితివే-భ్రాంతులెల్లను బాసి శాంతి నొందావె
॥యి॥౪॥ వాసిగా శేషమ్మ చరణాలె నమ్మవె-శాశ్వత బ్రహ్మపదవి
చేరి సుఖించావె ॥౫॥యి॥

## 3 కీర్తన

యేలా మునిగేరు యెర్రిబాలాలు తిక్క-బాలాలు చిన్ని బాలాలు స్థానాము యెరుగారు మీారు ||ప|| పాపాలాడెటి భావి పరిపూర్ణ మైనా?-చాపాల భావిలో చెలు లాడేక-చాపాలభావిలో చేలులాడె నరులాక-పాపాము నకులాడు పట్టించె అన్నా ||యే||౧|| గంగాయెమునల నడుమా ఘనమైన కొలనుంది-మంగాళ ప్రదమయిన మార్గా మున్నాది-అంగాన లోపల అమరా స్థాన ముంది-శృంగారంపు బోటి చూడాగ లేరు ||యే||౨|| తడువాని యెండాని స్థానము గన వలె-తడిసియుండేది స్థానా మగునా-నిమువాక శేషమ్మ చరణాలు నమ్మితె-తడువాని స్థానాము దయచేయు మనకు ||యే||3||

## 4 కీర్తన

సుదతీరో గురుడెంతో సులభూడో యమ్మా - సూటి దప్పక ముక్తి చూపించె నమ్మా ||సు||౧|| నడినాళమున దృష్టి నాడించె నమ్మా-యికపింగళూ నడిచె విధి దెల్పె నమ్మా ||సు||౨|| మూడు నాకులపైన ముక్తి వుందమ్మా - ముక్తి కాంతను గూడి ముద్దాడ వమ్మా ||సు||3|| యేసుకొండలపైన యెరుకాజే శెమ్మా - మూడు మండలమూల మీాదానో యమ్మా ||సు||౪|| గాలీ మానసు దృష్టి కదులాదో యమ్మా - కీలు దెలసితె ఆత్మ నీవైతి వమ్మా ||సు||౫|| శేషశయనుని పదము చేపట్టా నమ్మా- శేషమ్మ గురుశేవ క్షేమా మో యమ్మా ||సు||౬|| భ్రాంతు లన్నియు బోయి బయలాయె నమ్మా- బారదాసుకు అంతా భ్రమ లాదిలె నమ్మా ||సు||౭||

## 5 కీర్తన

హారాతి పాటలు బాడారమ్మా సద్గురునకు మంగళ-హారాతి పాటలు బాడారమ్మా ||ప|| హారాతి పాటలు బాడరె హంకార మంతయు విడచి ఓం-కార నాదము బలుకగా ఓం న్నమః శివా యాని ||హా||౧|| మనసాన పళ్లెము లోను మమూతాన జ్యోతీని నిలిపి వాదభేద మనె వత్తిజేసియును సా-ధనంబులనె చమురు బోశి

యును వేదాంతంబున వెలిగించు-చూను ఖేదమోదములు నూాదక మీారును ॥హ॥౨॥ ఆశాపాశాము లన్నీ విడచీ సంసార మనేది-మోసమనియేసి మీా మది తెలిసి దేశికోత్తము జేరి మీారును-దాసినని దరిజేర్చు మనుచును నోసి లొగ్గియు వేగమే గురుని ని-వాసమె సోహం సోహం బనుచును ॥హ॥౩॥ తాపత్రయములాను బాసీ తానె తానయ్యీ-తాత్పర్యా మంతాయూను దెలసి తనుమనధనములు తన గురునకు మది - తాత్పర్యాము మది తగ నడంచుచు తంద్రీ తల్లి మరి దైవము గురు డని_తారాకనామము దలచుచు మీారును ॥హ॥౪॥ ఆత్మానాత్మ దెలసి అంతరమూనా - ఆరూటి పొందగా విడచీ ఆరుపట్టణములను దాటుచు - మేరుశిఖరము మేడ జేరుచును జోడుమేళములు వేసుక మ్రోయుగ - ఆ డెటి పాడెటి హంసను కనుగొని ॥హ॥౫॥ బయలె భావన జేయుచు పరమా శేషమ్మ-పాటలెల్లాను పాడుచు పరిపూర్ణం బనె-బాట తెలసియును పరులమాటాలు పదపడి వినకను-బారదాసుడును భవము దేరి_యును పరమానందము జెందియు మీారును ॥హ॥౬॥

శ్రీ శేషమాంబ ప్రియశిష్యుడు అగు భారలింగస్వామి

విరచిత తత్వములు సంపూర్ణం

శ్రీ నిజ గురవే నమః

## శ్రీబారలింగస్వామి ప్రియశిష్యుండు నగు

# వెలివేర్తి రామచంద్రమూర్తి కృతులు

### 1 కీర్తన

శ్రీగురునాయక నమోనమో ఆశ్రితఫలదాయక నమోనమో -బాగుగ నేలవె వేగమె మ్రొక్కెద॥శ్రీ॥౧॥ పాపవిమోచన నమోనమో పావనరూపక నమోనమో-పరమదయాకర పరమశుభాకర॥శ్రీ॥౨॥ రశికజనార్చిత నమోనమో వసుమతి పావన నమోనమో-సుచరిత

చారిత పశుపతిపావన ||శ్రీ||౩|| పరబయలాస్పద నమోనమో పరమ
పురుషహార నమోనమో-యెరుక మరుపుగల యరుగనణం చేటి||శ్రీ||౪||
అచలాత్మాఘన నమోనమో సచలాత్మానుత నమోనమో-అచలా
చల నిర్వచననిరంతర ||శ్రీ||౫|| వెలివేర్తిపుర నమోనమో కలిసం
హారక నమోనమో - వెలిలో అంతట నిలయు నిజాస్పద ||శ్రీ||౬||
రామదాసనుత నమోనమో నామసుధారస నమోనమో-భ్రామిక
లణచేటి కామసంహారక ||శ్రీ||౭||

## 2 కీర్తన

శరణు జేతునయ్యా గురువరా రెండుకరము లెత్తి-శరణుజేతు
నయ్యా గురువరా ||ప||౧|| శరణుశరణు శరణుశరణు - కరము
భుజము లురము శిరము పదములూను - ధరను మోపి శరణు జేతు
పదములూను||శ||౨|| మ్రొక్కులిడుదు పదియునూర్లును వేవేలు లక్ష
లెక్కలేని కోట్లు మార్లును - యక్కవయిన అర్బుదములు మిక్కిలీ
అక్షోణులూను-గ్రక్కనా అనంతములుచు మక్కువాతో మ్రొక్కె
దాను ||శ||౩|| దండ మిడెద నిండువేడ్కతో వైరాగ్య మొద
వఖండమునకు-నిండు భాక్తితో దండమూ సాకారమునకు దండి నిరా
కారమునకూ-దండమూ అచలమునకు దైవమునకు గురున కెపుడు
||శ||౪|| దాసవరద దేశికోత్తమా వెలివేర్తివాస మోసరహిత దాత
మ్రొక్కెదా-ఆశ పాశ నాశ యీశ వాసవాస దేశికేంద్ర-దాసుడైన
రామదాస పోషవేష భాష నీకు ||శ||౫||

## 3 కీర్తన

కరుణ యేలరాదు నాపై కమలనాభ మ్రొక్కెదా - తరుణో
పాయమూను జేయు స్మరణతోను జిక్కెదా ||క||౧|| వంతుకైన
బ్రోవకున్నా వచ్చునీ కపకీర్తయా-పంత మేల దలచినావు చింత బాప
కీర్తయా ||క||౨|| శేషభూత మయినవాడా చేతబట్ట వేలయా-
శేషశయన దోష మెచ్చు క్షేమమెరుగ కున్నయా ||క||౩|| పక్ష

పాత మేల సర్వరక్షభార ముండగా - సాక్షివయ్యి దీక్షతో ప్రత్యేక మేలకావురా ॥క॥౪॥ పట్టు బెట్టెదాను చూడు వరము లివ్వకున్నరా-గట్టి బోలో నీదుమహిమా కాని చూచెదానురా ॥క॥౫॥ మొరను బెట్టుచుండగాను తిరిగి చూడ వదేమిరా-ధరలో రామదాసు నిన్నె దలచుచూ నున్నాడురా ॥క॥౬॥

## 4 కీర్తన - ఆటతాళం

పలుకా వెందుకురా పిలచినగాని పదరా రామయ్యా - పలుక వేటికి పంత మేలను చింత దోచె నిరంతరంబున - చిలుకపలుకులు ఆలకించియు శీఘ్రముగ మోక్షంబు లిస్తివి ॥ప॥౧॥ జడుపు దోచెనురా జానకిరామ గడుపూ చేయకురా - దుడుకు చేయకు దొరవు నీవని తలచి నమ్మితి ధర్మసాక్షిగ-కడకు దోలుము కర్మములు మరి కరుణసాగర కలుషభంజన ॥ప॥౨॥ నీసాటివారూ యెవ్వరు లేరని మురసేవుగానీ - వాసవాది వినుతుడా నని వేడినందుకు జూడనైతివి - వేసటాయె నాదు మనసుకు దోష మెచ్చు సుమ్మి నీకిక ॥ప॥౩॥ ఘనులా కిది తగునా వీనుల వింబె మునులూ మెచ్చుదురా - పనికి మాలిన బంటు నంచును పలుక అనుమానింతువేమో-వినుతి చేయుచు యున్నవాడను విన వదేలను విశ్వరూపక ॥ప॥౪॥ మరువాబోకయ్యా యెప్పటి కిదియు స్థిరమూ గాదయ్యా-యిరవుతోడుత రామదాసును కరుణ జేసియు బ్రోవకున్నను-శిరియు మెచ్చక నిన్ను జేరదు కరువు గల్గును కాని చూచేవు ॥ప॥ ౫॥

## 5 కీర్తన - ఆదితాళం - రాగం_ధన్యాసి

యరుకను నమ్మకుడీ అచలము ఎప్పుడు మరువకుడీ - యరుకను నమ్మకు ఎన్నటికయ్యేన యిమ్ముల బెట్టును సుమ్మీది నిజముగ ॥ప॥ ఎవ్వరు గారుసుమీ అందరు ఎవరికి వారె సుమీ - యవ్వరి తనువులు వారికి తనవలె దవ్వై వుండును నవ్వులుగా వికి ॥య॥౧॥ ఏది తనదిగాదు అంతయు వేరువేరు వుండూ - వాదమువదలీ భేదము

తెలియుడీ – మీదయ నుంచియు సాదర మినుడీ ||యు||౨|| తనదు
క్షేత్రపాత్రం విత్తం ధనధాన్యము మొత్తం–తనయులు భార్యలు తగ
చుట్టంబులు – తనువులు వేరే తను వేరా యను ||యు||3|| తనువు
తానుగాదూ తలచితె మనసు – తాను గాదు తను వింద్రియంబులు
తా నెట్లయ్యెని – మనమున తెలియుడీ మరి తను వేరని ||యు||౪||
దృశ్య మయిన దంతా తనవలె– ఐశ్వర్యంబా నంతా అస్థిర మని కని–
వశ్యము నొందక ర–హస్యము దెలిసికొను దృశ్యము వినువుడీ ||యు||౫||
తాను రాకముంగూ తమపరి మేను గలిగినపుడు – పూాని వున్నదీ
పొందుగ వినుడీ – మేను బోవుతరి మానుగ నుండును ||యు||౬||
దాసదాసులందూ రామదాసు పల్కె– ముందూ– మోసపోక గురు
వాసము జేసికొను–నాశగు మానుగ దోషము బాసియు ||యు||౭||

## 6 మంగలహారతి – ఆదితాళం

మంగళం శుభ మంగళం గురు–పుంగవం జయమంగళం ||ప||
అంగలింగా సంగరహితా–అచల నిర్గుణపుంగవం ||మ||౧|| దేహి
దేహ విలక్షణంబీ–దేహ మజమచ లక్షణం–అహమస్మిం బ్రహ్మ
మనెటి ఆత్మ కావలి కీలకం ||మ||౨|| ఆశపాశ వినాశకం వుప–దేశ
ఘన సర్వేశకం దోశద్వంద్వాతీత–అసిపద దోషరహిత విదూరకం
||మ||3|| వర్ణపర్ణ వివర్జితం ఆవర్ణ మాకశ మస్థిరం – నిరావర్ణ
నిరుపమదాయకం – నిజ మచల మేకద సుస్థిరం ||మ||౪|| వాదభేద
నివారకం దశనాద మూలమ భావకం – వేదసారా తీత రహస్యము
ద్వాదశార్థ సునాయకం ||మం||౫|| భారలింగా ప్రభువరం భ్రాంతి
సర్వ వినాశకం – భార మొరుక నివేదకం వర రామదాసు సురక్షి
తం ||మ||౬||

శ్రీ భారలింగస్వామి ప్రియశిష్యుడు నగు వెలివేర్తి రామచంద్రమూర్తి
కృతులు సమాప్తం

శ్రీ అచలగురవే నమః - హరిః ఓం

# శ్రీరామచంద్రమూర్తి ప్రియశిష్యురాలున్ను సతీతిలక మగు

# సత్యమాంబ కృతులు

## 1 కీర్తన

శ్రీరామచంద్రగురుని చింతా యేమారనె - మా రామచంద్ర గురుని మదిలోన మరువనె ॥శ్రీ॥౧॥ పతియూ గురుదైవాము గతి తానె అయనే - సకలశాము జాగ్రత్స్వప్న మరి తానె అయనె ॥శ్రీ॥౨॥ సాంఖ్యా తారకమనస్కాము దారి యెరుకానె కే - సంఖ్యా లేనిసి అచల సాజ్జయము తెలిపెనే ॥శ్రీ॥౩॥ రాజానంద రామమూర్తి రంజిల్లా జేసెనే - తేజా మొంటమాచు నుండి పెంపొంద జేసెనే ॥శ్రీ॥౪॥ అన్నామరాజవంశుడు అనంతా కృష్ణుడూ - కనెను సరస్వతమ్మ ఘనునిసి శ్రీవిష్ణుని ॥శ్రీ॥౫॥ భాగవత సాంప్రదాయుడు భరద్వాజ గోత్రుడూ - వేదామే యజుర్వేద ఆదిశాఖస్తుడూ ॥శ్రీ॥౬॥ వేదా వేదాంత వేద్యుడు వెలివేర్తి వాసుడూ - సాధు కేశావపురమున నాదు ప్రాణేశుడు ॥శ్రీ॥

## 2 హారతిపాట

కర్పూరారతి ప్రాణ కాంతా శ్రీరామా - నేర్పులేకను చెంత చేర్చాలే ప్రేమ ॥క॥౧॥ అరిషడ్వర్గము నెల్ల అంటానివ్వకుమా - కరువు దీరగ నాదు కాంక్ష దీర్చుచు మా ॥క॥౨॥ నోట నుడివిన పలుకు నాటె నా మదికీ - సూటి దప్పగ యపుడు చూతూ యప్పటికీ ॥క॥౩॥ కలుష తిమిర పతంగ కరుణాంతరంగా - లలిత సద్గుణ భృంగ ఘనకీర్తిసాంద్ర ॥క॥౪॥ సతతాము వెలివేర్తి సదనావివేక - క్షితి సత్యమాంబ పోషిత మోక్షటీకా ॥క॥౫॥

శ్రీ రామచంద్రమూర్తి ప్రియశిష్యురాలును సతీతిలకమగు
సత్యమాంబ కృతులు సమాప్తం

అస్మతు గురుభ్యో నమః

# శ్రీధరస్వామి గురుపరంపర పీఠిక వేదాంత గ్రంథము

శ్రీమ దార్వేలనియోగి కౌండిన్యసగోత్ర రంగరావుశర్మ వంశపయఃపారావారసుధాకరుం డగు కరణము తిమ్మయాఖ్య సతీతిలక మగు నరసమాంబ గర్భ జనిత పుత్రత్రయములో ప్రథమపుత్రు డగు శివరామదాసునిచే రచియింపబడిన పరిపూర్ణభక్తి యగు గురుకీర్తనలు. గురు శిష్యానువాద రూపక గేయ పద్యావళి సమస్తం సర్వభక్తశ్రేణికి శులభముగ దెలియుటకై ప్రకటింపబడియె॥

శ్రీ అచల గురవే నమః

శ్రీధరస్వామి గురుచరణారవిందాభ్యో నమః

శ్లో॥ శ్రీధరస్వామినం నిత్యం బోధకారణ మవ్యయం
భావాతీతం మహాంవందే సుకజ్ఞానైక నిర్మలం॥

శ్రీ శివరామ దీక్షిత గురవే నమః

శ్లో॥ వందారు జనమందారం వందేహాంత నిరంతరం
రామడుగు వంశజం శుద్ధం శివరామాఖ్య దీక్షితం॥

శ్రీ-అప్పలార్య గురవే నమః

శ్లో॥ కామాది రిపుహంతారం కారుణ్యాం మృదసాగరం
కంబా రూరప్ప లార్యానాం దాసం వందేచ మద్గురుం॥

శ్రీమత్ పరశురామ శ్రీ శీతారామ పరమేష్టి గురవే నమః

శ్లో॥ పరశురామాన్వయాబ్ధి చంద్ర మనోరమం
నిత్యానందం మహాం వందే శీతారామః పరః పరం॥

శ్రీ శేషాచల పరమ గురవే నమః

శ్లో॥ పరశురామాన్వయంబోధి యుమాంసశ్చ మనోరమం
శీతారామశ్చ భక్తానాం శేషాచల గురుం భజే॥

శ్రీ భారలింగ నిజగురవే నమః

శ్లో॥ శేషాచలాన్వయాంబోధి బారదేశిక ముత్తమం
నిరంజన నిరాకారం భారలింగ గురుం భజే॥

శ్రీ రామచంద్ర పరమగురవే నమః

శ్లో॥ భారదేశికాన్వయాబ్ధి రామదాస గురుత్తమం
నిరామయ నిర్వికారం రామదాస గురుం భజే॥

శ్రీ సత్యమాంబ నిజగురవే నమః

శ్లో॥ అన్నమరాజాన్వయాంబోధి ఇమాంసశ్చ మనోరమం
శ్రీరామదాసభక్తానాంసత్యమాంబ గురుం భజే॥

శ్రీ సుగుణాకరస్వామి నిజగురవే నమః

శ్లో॥ శ్రీ సత్యమాంబాన్వయాబ్ధి సుగుణాకరాఖ్యాం గురుం
నిర్గుణశ్చ గుణాతీతం సుగుణాకరాహం భజే॥

ఉపజాతివృత్తి॥ శ్రీమత్సదాదివ్య శుభాకరాత్మం
శ్రీమత్సదాభవ్య సంపూర్ణ సూత్రం
శ్రీమత్సదా మవ్యయ మప్రమేయం
శ్రీ సద్గురుం సుగుణాకరం భజే॥

వృ॥ రంగారావు వంశతిలకాన్వయు కౌండిన్యసగోత్రసంపన్న
మురాంశికాచి సురభాస్కర మాని పదాబ్జముల్ మదిన్
తిన్నగ నమ్మి దాసులకు తీర్థప్రసాదములబ్బజేయు మీ
కన్నను మిక్కిలి కానము కంటిమి శ్రీ శివరామదాసులన్॥

---

# ప్రబోధ తరంగము

కల్యాణి రాగము ఆట తాళం

శ్రీగురుదేవ వేగము రావ జాగును జేయకురా - ఓ దేవ జాగును జేయకురా ॥శ్రీ॥ కోరితి నిన్నే సారసనయనా - నేరము లెంచకురా ఓ దేవా భారము నీదేరా ॥శ్రీ॥ హరిహరులకు నీవు ఆధారుడవై - అంటక నుందువురా ఓ దేవా వేరుగ నుందువురా ॥శ్రీ॥ కలికవతారుడ పిలచిన పలుకవ లీలలు జేయకురా ఓ దేవా అలుకలు

యేలనురా ॥శ్రీ॥ నందకుమారా నవనీతచోరా - నీదయ జూపుమురా ఓదేవా బేధము యేలనురా ॥శ్రీ॥ దశవిధ ప్రణవ నాదంబులచే నాట్య-మునలిపెదవా ఓదేవా ఆటలు ఆడెదవా ॥శ్రీ॥ మురళీలోలా మునిజనపాలా - కరుణ జూడుమురా ఓదేవా శరణు జేసెదరా ॥శ్రీ॥ చిన్మయ రూపా చిన్నిలోనయుడను - కన్నుల జూడుమురా ఓదేవా నిన్నే దలచెదరా ॥శ్రీ॥ ధరణిలోవుప్పల్ ధడ శివరామదాసుడు - నిరతము వేడెనురా ఓదేవా మరువబోకుమురా॥శ్రీ॥

## 2 శంకరాభరణము రాగము ఆది తాళం

గణేశ నిన్ను మదిలో నెప్పుడు మరువక దలచెద - గణేశ్వరా నన్ను కావను వేగమె రావె మన్నన జేయుము గణేశ్వరా॥గ॥ వాదభేదముల మాన్పను ఎప్పుడు మదిలో నిలువవె గణేశ్వరా-హృదయములో షడుశతము జపము మొదట లర్పితమయ్యె గణేశ్వరా ॥గ॥ వనశష లనియెటి వర్ణబీజమున నివశించిన గణేశ్వరా - సంచితాదుల నన్నియు బాపి చెంతకు జేర్చవె గణేశ్వరా ॥గ॥ యిద్దరి తల్లుల ముద్దుబిడ్డవని వద్దికతో నిను జేరితి - పద్దుయేల ఇక సుద్దులు జెప్పను వేగమె రావే గణేశ్వరా ॥శ్రీ॥ ధరణిలోన శివరామదాసుడు చాల నమ్మెను గణేశ్వరా-అరమర లేకను ఆదరించవె ఆగనాయకా గణేశ్వరా ॥గ॥

## 3 ధన్యాసి రాగము రూపక తాళం

శ్రీ శారదసతి వనుచును చిత్తంబున నే దలచెద-ఆసాంతము నా హృదయము చేరుండుము శ్రీభారతి ॥శ్రీ॥ భేదంబును మాలా నాపై నీదాయ జూపుము దేవి-వేదంబుల బోధించను నీవే కద ఆధారము ॥శ్రీ॥ ముక్తిప్రదాయని వని భక్తితో భజియించెద-భక్తాలా రక్షింప భారాము నీదే కద ॥శ్రీ॥ శ్రీలక్ష్మి కోడలివి త్రైలోక్య సుందరివై-పల్లవాధరి నిన్నా యుల్లాముస దలచెదను ॥శ్రీ॥ నామరూపామానీ సోమాసుందారివో-నామాది బాయకను సామాజనయునరో ॥శ్రీ॥ ధరణీలో వుప్పల్ ధడ-శివరామదాసుడు నిను-నిరతాము మది మరువక స్మరియింపుచున్నాను ॥శ్రీ॥

4 తోడి రాగము ఆది తాళం

భక్తులార - సద్గురు [illegible] పరా నొక పాట [illegible] బల్కెదను - భక్తులందరు [illegible] గురువులచే బడయుబట్టె గురుమర్మ[illegible]ను ॥భ॥ ముదు శ్రీధరస్వాములు [illegible] శివరామదీక్షితులకు తెలిపెగ అందరాని [illegible] [illegible]ను [illegible] తెలిసెగ ॥భ॥ జగమే లేదని [illegible] శ్రీ[illegible]రాములకు తెలిపెగ-జగములు మిథ్యని శీతరాములు శేష[illegible] తెలిసెగ ॥భ॥ తమగురుమర్మము శేషమాంబ మును భారగుపునకు తెలిపెగ - లేనిది ఎన్నడు లేదని భారయు రామదాసు కెరిగించెగ ॥భ॥ [illegible] లేవని రాములు సత్యమాంబకును తెలిసెగ - సత్యమాంబ గురుమర్మము సుగుణాకర గురువరునకు తెలిపెగ ॥భ॥ [illegible]రహిత మని సుగుణా కరగురు శివరామదాసునకు తెలిపెగ - మనవక నీ చరణములను చదివె [illegible]హాత్మ్మ లెరిగిన మర్మ మిదిగ ॥భ॥

5 శంకరాభరణము రాగము ఏక తాళం

నీలకంఠుని నమ్మి భజించితె నిజమును తెలుపును వరేవరే- కాల కర్మముల బాధ మాన్పి నిను గతి తేర్చును గా వరేవరే ॥నీ॥ పంచాక్షరి మద [illegible] జేసి [illegible] సంచిత మొదులును వరేవరే - పంచభూత ప్రపంచవికారము భ్రాంతులు తొలిగితె సరేసరే ॥నీ॥ తారక మంత్రము విరచితె ముక్తి దగ్గర వుండును వరేవరే-కారణగురు వని మదిలో నెప్పుడు స్మరణ జేసితె సరేసరే ॥నీ॥ షోడశాక్షరి భావము దెలిసితె నీమనుజ జన్మము వరేవరే - ద్వాదశాక్షరీ నమ్మి భజించితె ధన్యుడ వగుదువు సరేసరే ॥నీ॥ మరువక ఎప్పుడు మూడుమంత్ర ములు నమ్మి స్మరించర వరేవరే - పరమపదమె సు స్థిర మని నీకు దృఢము గలిగితే సరేసరే ॥నీ॥ యాధర లోపల శివరామదాసుడు యిటుల బల్కెను వరెగరె - హాదరంబుగ సద్గురు వచనము ఆధా రంబను వరేవరే ॥నీ॥

## 6 శంకరాభరణము - బ్యాగ్ ఆది తాళం

అతిమధురంబై అతిసారంబై ఆధారంబై ఆదరించేదియేదయ్యా
నాదబిందుకళ లన్నియు తానై నాట్యము జేసే దదేనయా ॥అ॥
అంటిఅంటకను వంటరి కేగిన వెంటనె వుండే దేదయ్యా-జంట బాయ
కను వంటి గుండకను యింటిలో వెలిగే దదేనయా ॥అ॥ మంద
మతులకు అందబోక మరి అంతట వెలిగే దేదయ్యా - నాదభేదములు
వదలినవారికి ఏకరూపమై తోచునయా ॥అ॥ సత్తుచిత్తులకు సారం
బైన వుత్తమపదవిని తెలుపరయా-భక్తితోడ సద్గురువుల చేరితె
చిత్తములోపల తెలుసునయా ॥అ॥ మూలము లేనిది తోలుశరీరము
వాంఛ లుడుగ మననేలనయా - మేలుగ ద్వాదశి కీలు దెలుసుకొని
కదలక నిలిచే టందుకయా ॥అ॥ ధరణిలోన వెలివే త్రిరాముల దాపు
జేర మననేలనయా - అరమరలేక నుప పరమపదవిని మనసు-నతోమత
తెలుపునయా ॥అ॥

## 7 తోడి రాగం చాపు తాళం

గురువునూ కనుగొను మనసా నీ కర్మము తెలియును హంసా-
గురువును కనుగొనె గురుతు దెలుసుకొని-నిరతాము గురుస్మరణ మరి
మారి శాయవె ॥గు॥ యెక్కడ వెతకాకె మనసా నీ యెదట
వున్నడు చూడె హంస-ముక్కుపైనను చూ పెక్కబెట్టూకొని-
నిక్క చూడుము యిక చక్కని స్వామిని ॥గు॥ నామరూపము
లుసుల్లా గురు మర్మము దెలసుట వల్లా-సోమారి తనమూను వద
లీయును నీవు-కోమూలాంగుని కోరి భజించవె॥ గు॥ మరుపును
జెందకె మనసా యెల్లప్పుడు తరచావె హంసా-అరమరుదుడుగ గురు
అష్టబాంధవుడు-సర్వము గురు వని సర్వము యుండన ॥గు॥ మాయను
నమ్మగ బోకూ యీ కాయము స్థిరమనవోకు-దేహేంద్రియంబు
లుపాయాము చేతను - పాయక సద్గురు శేవ జేయుము వేగ॥గు॥
ఎంద దుండిన గానీ మనసా నీకు యేమిఫలములేదు హంస - సందేహ
ములు మాని సర్వము వదలీయు - ముందు వెనుక నున్న అందమైన
గురుని ॥గు॥ కులము రూపము లేనివాడూ మనసు కుదురూగ నిలచి

వున్నాడు - సలలితంబుగ గురు సాజ్ఞకు లోబడి - కల కాలమును నీవు కదలాక నిలచుండి॥గు॥ ధరలోన వెలివేర్తిలోన రామదాసుడై యున్నాడే హంస - కరుణాతో శివరామ దాసుని మొరవిని-అర లేక బోధను మరుగు దెలిపిన యట్టి॥గు॥

## ౮ మాయామాళవగౌళ రాగం ఆది తాళం

యాత్ర కొచ్చినామూ జీవా యాత్ర కొచ్చినాము - యాత్ర కొచ్చితిమి లేక చూచినను గాత్రముతోడుత కాలము గడుపను॥యా॥ ధాత్రిలోన వెతికీ గురుని దాపు జేరుకొని నాల్గు - విధముల సేవ జేయుచును దీ-క్షత్రయములను తిన్నగ తెలియను॥యా॥ దినము దినము గురునీ మరువక భజన జేయుచూను-మనసునందున మరువక యెప్పుడు గురుని మంత్రముల ధ్యాన్నము జేయను ॥యా॥ యాత్ర గడుపుటాకై తనలో ఓర్పుతోడుతాను - పాత్రాపాత్రము ఎరిగియు గురుని-సూత్రము దెలుసుక సూటిగ నడువను ॥యా॥ వున్నదాని యందూ లేనిది వన్నె బాయుటకును - సన్న బిళమున వున్న శంక రుని-కన్నుల చూచి కలసి వుండుటకు ॥యా॥ గట్టిగ మనసునూ గురుని పట్టు వదలకాను - గుట్టు దెలుసుకొని బట్టబయలు గని - దిట్టముతోడుత నిలచివుండుటకు ॥యా॥ ధరణిలోపలానూ రామ గురుని దాపు విడక - గురువుకన్నను పరములేదు అని శి-వరామ దాసుడు మదికి జెప్పెను ॥యా॥

## ౯ మాయామాళవగౌళ రాగం ఆట తాళం

సత్యమూ మనసా సత్యము సద్గురునిమాట - సత్యమూ మనసా సత్యము ॥స॥ సత్యమూ సద్గురుని మాట నిత్యము నీమదిలో - నమ్మితి - సత్తుచిత్తుల బాపి నిన్ను వుత్తమైన పదవి జేర్చును ॥స॥ వట్టిదీ జగమాని నీవు గట్టు దెలసుక నిలచి వుంటె - దిట్టముగ వెలి గేటి జ్యోతిని స్పష్టముగ చూపించు నీకు ॥స॥ ఫాలభాగమునందు వెలిగెటి లీల జ్యోతుల సందు దెలిసి తె-కాలపాశము లన్ని నీ కడకు జారవు అనుచు దెలిపెను ॥స॥ యేటి కిక నీ వట్టి భ్రమలు జూట

అనిమిషను వదలిపోయెను–నా చిన్నాటి పట్టి చింత లేని కింకరాను మనసు ॥స॥ వాసిగా నె వేద్రి [illegible] పము జెప్పి [illegible] ధ నమ్మి తె–
దాసు డగు శివరామదాసుని జొరాసమూ చేకాని జెప్పెను ॥స॥

## 10 మలహరి రాగం చాపు తాళం

కల్ల కాదు నిజము నిజమేర పరిపూర్ణ మంతటా నిండియున్నది నీవు తెలియుమురా–కల్లగాదు కల్లగాదు ఎల్లలోకము నిండి తాను–ముల్లు మోపను సందులేక యంతటా నున్నదదిగో ॥క॥ రూప నామ క్రియలు లేనిదిరా ఆపరమపదవి–తాపసులకు అంబోనిదిర రూపనామక్రియలు లేక–చూపునకు గోచరము గాక మోస మున్నది లేక నిరతము ఏకరూపై వున్నదదిగో ॥క॥ [illegible] ను నంటు అనగ రానిదిర ఆ అమరపదవి యెందు జూచిన తానె వున్నదిర–యిందు నందు అనగ రాక మంద మెల్లను అందబోక–సందు గొందులు నిండి యుండిన అందమయిన అచల మదిగో ॥క॥ యండమావుల వంటి దీ యెరుక ఆ విమలమందున–యెందు జూచిన నిలువకుండునుర–యెండ మావుల వంటి యెరుకను యెన్నటికి నమ్మబోకు–అండపిండ బ్రహ్మాండ మన్నియు అన్ని లయమగుచున్న వదిగో ॥క॥ అందరాని మార్గ మిది అనెను భారత్యాగారు అందిపొందిన మార్గ మిది అనెను–యాధ రందున నిజగురుం డగు రామదాసు ప్రభువరేణ్యులు – శ్రీధరుండే యనగ వెలసిన శివరామదాసుని భయము బాపెను ॥క॥

## 11 శంకరాభరణము ఆది తాళం

అదే చరాచర మంతయు తానై కదలక నిలచిన దదేకదా–బాధలేక గురుబోధ నెరుగు గురుసాధకులై తే తెలుసుగద ॥అ॥ నామరూపములు లేను యెప్పుడు మోహము జెందని దదేకదా–నేమముతో సద్గురుడు శిష్యులకు ప్రేమతో తెలిసిన దదేకదా ॥అ॥ పుట్టక గిట్టక యెప్పుడు నినను బట్టబయట నె వుండగ చా–పట్టు లేనిది పరమపదవి యని మొట్టమొదటనే తెల్పెగదా ॥అ॥ కన్నది విన్నది అన్నది సకలము సున్న జెయ్యమని తెల్పెగదా – కనుగొన శక్యము

కనువుండె అచలము కను మని చూపెగదా ॥అ॥ సాధన లెల్లను
ానుమనియును సద్గురుమూర్తి చెప్పెగదా- అదీ మధ్యా అంతము
(ను అతీత మయినది తెల్పెగదా ॥అ॥ ధరణిలోన వెలివే ర్తి
ములు దాసుల తాపము మాన్పెగదా-మరువక శివరామదాసుడు
ప్పుడు మదిలో నిల్చిన దదేకదా ॥అ॥

## 12 సావేరిరాగము ఆట తాళం

తెల్లవారెను ప్రొద్దు బొడిచెను - జగము యుగములు కల్ల
యెను-యుల్లమందున మరువబోకను భ్రమలు మేల్కొ-నరా జీవా
ంకొనరా ॥ తె॥ అల్పగుణముల చేత నీవు స్వల్పసుఖముల అను
ంచుచు - కల్పనలలో జిక్కి- నీవు నిల్పు మరచెదవా జీవా నిజము
నవా ॥ తె॥ చిత్తచలనము చెందబోకు చింత లన్ని శేయ
కు - వృత్తదానిని నమ్మి నీవు వులుకు జెందకురా జీవా మరుపు
దకురా ॥ తె॥ ప్రాయ మెల్ల గోలుబోయెను నామ మంతా
ల మాయె - కాలయముని రాకటాయను గురుని మరువకురా
గా సిరముగా దిదిరా॥ తె॥ అత్యంత కాలము భ్రాంతి జెందితె మమత
కను రానుపోనగు-శాంతమతిచే సూటి దప్పక భ్రాంతి వీడుమురా
గా బయలు మరువకురా ॥ తె॥ సిరముగా నీ బుద్ధి నీవు కదలకుం
( నిలిపి అవలా - పరమునందున జేర్చి నీవు కుదురు పరచుము రా
గా యెరుక తొలగునురా ॥ తె॥ ధరణిలో వెలివేర్తిరామ గురుని
న్నధి జేరితేను-శివరామదాసుని దురము లన్నియు ద్రుంచివేసెనటా
గా మేలుకొనరా ॥ తె॥

## 13 తోడి రాగం అది తాళం

అమ్మరో వినవే సత్యమ్మా మమ్ముల బ్రోవను రావమ్మా -
మ్మరో వినవే సమ్మతితో మత వేగమె యిటకూ రావయ్యా ॥అ॥
వ దేవులకు దేవివి నీవని భావము నందున భక్తితో సమ్మతి-కావగ
వ కరుణయు లేదా కారణమేమొ తెల్పుమా ॥అ॥ మూడుగుణము
ఎ మూలము నీవె జాడను దెలిపె మాతవు నీవె - యీడుజోడు

లేక పాడపాడలలో ఆడచు పాడుచు నుంటివి ॥అ॥ యీషణా
వాసన దోషగుణంబుల యింద్రియముల గెలిపనె ఓజననీ - ఆశపాశముల
త్రోలివేసి నిజదారిని తెలిపనె ఓజనని ॥అ॥ ఆరుకమలముల కావల
యీవల వెలుగుచు నుందువె ఓజననీ - పరిపరివిధముల శరణు జేసె
దను శాంతముతో సన్నేలుమా ॥అ॥ ధరణిలో నీకన్న దాతయు
లేదని మరువక దలచెద ఓఅమ్మా - పరమభక్తుల పాలన జేసెటి
పాతకహారిణి ఓజననీ ॥అ॥ దాసదాసులకు దాసుడ నని శివరామ
దాసుడు వేడెను - దాసుల బ్రోవను యీశుడైన శ్రీనివాసుడు నిను
జేరనిచ్చెడూ ॥అ॥

14 నాదనామక్రియ రాగం చాపు తాళం

భక్తులు రారండయ్యా వుయ్యాలో గురుని ముక్తికై వేడరే
వుయ్యాలో - శక్తివంచన లేక వుయ్యాలో గురుని భక్తితో పూజించ
రుయ్యాలో ॥వు॥ ఎదట వున్నాడయ్యా వుయ్యాలో గురుని మరువ
బోకండయ్యా వుయ్యాలో - పాద శేవలు జేయు రుయ్యాలో గురుడు
పాలించి కడతేర్చు వుయ్యాలో ॥భ॥ తనుమనధనములు వుయ్యాలో
గురుని స్వాధీనమును జేయు రుయ్యాలో - వినయాముతో మత
వుయ్యాలో గురుడు మలినములను బాపు నుయ్యాలో ॥భ॥ నాల్గు
విధముల శేవ లుయ్యాలో గురునకు ఆనందముగ జేయ రుయ్యాలో-
పాలభాగమునందు వుయ్యాలో గురుడు పరమాత్మను చూపు
నుయ్యాలో ॥భ॥ కలలోని పను లన్ని వుయ్యాలో గురుడు
కర్మాము లని తెలిపె వుయ్యాలో - పలుకులేని దానిని వుయ్యాలో
గురుడు మెలుకువతో కనుమనె వుయ్యాలో ॥భ॥ భావభావములాకు
వుయ్యాలో గురుడు అంటాక నుండును వుయ్యాలో-భావతీతామయ్యి
వుయ్యాలో గురుడు బయలయ్యె యున్నాడు వుయ్యాలో ॥వు॥
యెరుక మరుపుల నెపుడు వుయ్యాలో గురుడు నమ్మవల దని తెలిపె
వుయ్యాలో - గురుతు లేనిదానిని వుయ్యాలో గురుడు మరువవలదని
తెలిపె వుయ్యాలో ॥వు॥ సాధనలచేతను వుయ్యాలో గురుడు
సాధ్యామే కాదనె వుయ్యాలో - యెందెందు చూచిన వుయ్యాలో

గురుడు నిండివున్నాడయ్యా వుయ్యాలో ॥వు॥ యుక్తిచేతను
తెలియ దుయ్యాలో గురుడు శక్తికి చిక్క దని వుయ్యాలో-భక్తికి
చొక్కు దనె వుయ్యాలో గురుడు సౌజ్ఞ చే తెలియూ బనె వుయ్యాలో
॥వు॥ ధరలోన వెలివేర్తిలో వుయ్యాలో గురుని దరిశన మవు
నసె వుయ్యాలో - శివరామదాసుడు వుయ్యాలో గురుని మరువ వల
దని తెలిపె వుయ్యాలో ॥వు॥

## 15 శంకరాభరణము రాగం ఏక తాళము

చూడండయ్యా మీరు చూడండయ్యా-ఆనంద దేవిని చూడం
డయ్యా-వేదూకి చాతను చూడండయ్యా ॥చూ॥ సుందరముతో తన
మర్మంబు దెలుపక-అంతయూ తానయ్యె నిలచిందయ్యా-ఆది అంత్య
మూ తానయ్యి నిలచిందయా ॥చూ॥ పూరికి తూరుపున పూర్వ
గిరిపై తాను-హంసుని పంచన జేరి నిలచిందయా-గురుని పంచన జేరి
నిలచిందయా ॥చూ॥ నమ్మినవారిని నమ్మతంబుగ తాను-మర్మమూ
లన్నియు తెలుపూనయా దేహ-ధర్మముల నన్నిటిని తెలుపూనయా-
॥చూ॥ నమ్మనివారికి నరకమే గతియనుచు-ఇమ్మహీలోపలా తెలియం
డయా-మీకు స్థిరమనీ మదిలోన నమ్మండయా ॥చూ॥ పంచరంగుల
తోను చేరియూ తానొక్క - ప్రపంచమయ్యిందె చూడండయా-
మీరు ప్రపంచమును తరచి చూడండయా ॥చూ॥ యేదేహపదు
నాలుగు లోకములు తిరుగుచు - ఏకరూపముతోను వెలిగిందయా -
యేడచూచిన తానె కంపిందయా ॥చూ॥ ధర్మమే బడుగంటి
పోయెనూ చూడండి-కర్మమే ప్రబలంబు ఆయెనయా నేడు-ధర్మమే
విషమాయె చూడండయా ॥చూ॥ భక్తితో సద్గురుని పూజించె
వారికి - ముక్తి జూపెద ననీ పలికిందయా - భయభక్తిచే బిలువమని
చెప్పిందయా ॥చూ॥ ఒక్కరూపంబుచే పెక్కు రూపము లయ్యె-దిక్కు
దిక్కులు నిండి నిలచిందయా తాను - నక్కటయ్యె వుంది తరచం
డయా ॥చూ॥ యోగులా కందుకు భోగముల వదలియు-యోగమును
జేయమని జెప్పిందయా గురు - ధ్యానమే చేయుమని చెప్పిందయా
॥చూ॥ ముగురుమూర్తులకు మూలమే తానని - ఆదికాలమె తాను

పలికిందయా - వేగ వెతకమని చెప్పేనయా ॥చూ॥ ముక్తికి మూలంబు ముక్తికాంతే యని - భక్తులై మీరంత నిలువండయా పరమ - భక్తులై మీరంత నిలువండయా ॥చూ॥ ఆవలా వుండేటి అర్థంబు దెలిపియు - ఐక్యమయ్యీ వేగ పోతుందయా తాను - జాగు లేకనె వెళ్ళిపోతుందయా॥చూ॥ యీధరణి లోపలా వెలివేర్త్రిపుర ములో - రామ గురునీ మరువ బోకండయా మీరు - మరచితే భాధలు పడుతారయా ॥చూ॥ చెప్పినట్టుల గురు పంచనా జేరితే - మెప్పయిన పదవినీ చెందేరయూ మీరు - గొప్పయిన పదవినీ చెందే రయా॥చూ॥ వూరుపేరూ లేని వుత్తకల్లగు నాకు-పేరుబెట్టీ జనులు పిలతూరయా మూరు - పేరూ బెట్టి జనులు పిలతూరయా ॥చూ॥ వూరు వుప్పలధడ శివరామదాసు డని - ప్రజలెల్ల నోటను పలికే రయా-యిలలోన జనులంత పిలుతూరయా ॥చూ॥

## 16 సురట రాగం ఆది తాళం

పుట్టినందులకు గట్టిగ గురుపద పట్టువదలకే మనసా - మట్టు మితము లేనట్టి దేవుని గుట్టు దెలుపునే ఓమనసా ॥పు॥ మాయలో బడి నీవు కాలము గడుపుచు మరుపు జెందకే ఓమనసా - మాయను వీడియు గురుని స్మరించియు మమత యిడుగవే ఓమనసా ॥పు॥ యీషణత్రయముల చేతను జిక్కియు యిడుముల బడకే ఓమనసా- దూషణ జేయక దాసుని మాటలు మదిలో తలచవె ఓమనసా ॥పు॥ ఓపికతోడుత గోపాలుని నీవు కోరి భజించవె ఓమనసా - పాపడు వీడని తాపము బాపియు కాపాడును నిను ఓమనసా ॥పు॥ దాస దాసులకు దాసుడ నని నీవు దోసిలొగ్గవే ఓమనసా - ఆశపాశముల త్రోసివేసి నిజ దాసుని జేయునె ఓమనసా ॥పు॥ కర్మము లన్నియు మర్మము లని గురు ధర్మము దెలియవె ఓమనసా - నిర్మల మయ్యేన నిజమును దెలుపు కర్మము వదలవె ఓమనసా ॥పు॥ సాధన నామము మరువక దలచితె బాధలు తొలగునె ఓమనసా - గాధలు లేనట్టి బోధను దెల్పియు బాధలు బాపునె ఓమనసా ॥పు॥ భావ ములోపల భక్తితో నమ్మితె భ్రాంతులు తొలగునె ఓమనసా - భావ

భావముల కందని వస్తువు సూటి పరచునే ఓమనసా ॥పు॥ ధరణిలో వెలివేర్తి రామచంద్రుడు దాపు జేరవే ఓమనసా - పరిపరివిధముల పరువులు బారక స్థిరమును మనసకె ఓమనసా ॥పు॥

ప్రమోద తరంగము సంపూర్ణము

# వారసప్తక భజన తరంగము

1 శంకరాభరణం రాగం ఆట తాళం

భానువారమునాడు గురుని భక్తితో పూజించర స్వామి యని నుతియించరా నేమ మెరిగి భజించరా ॥భా॥ పావనం బైనట్టి పరమపావనుం డని తెలియరా - భావభావాతీత మయిన పదవినీ జెందించురా ॥భా॥ పలుకు కందక భావ మంటక పరము వున్నది చూడరా - పరశురాము శీతరాములు శేషమాంబకు తెలిపెరా ॥భా॥ కానిమాటలు పలికె కల్పరుడు లేదానరా - కనులు మూసి కనులు తెరచిన కానబడుచున్నాదిరా ॥భా॥ ధరణిలో వెలివేర్తి రామ గురుడు జెప్పిన బోధరా - దాసుడగు శివరామదాసుడు పలికినా పలుకీరా ॥భా॥

2 మాయమాళవగౌళ రాగం ఆటచాపు తాళం

యిందువారమునాడు చంద్రధరునీ నీవు సేవజేయవె వెర్రి మనసా - సేవ జేసితె హరుడు చేపట్టి రక్షించు మరినీకు తెలియద మనసా ॥యి॥ శివశంకరుని నీవు చింతన జేసితె చెంతకు జేర్చునే మనసా - భవబంధములు అన్ని భస్మమై పోవును సంశయము జెందకె మనసా ॥యి॥ కాలకంఠుని సేవ నేమముగ జేసితె కర్మములు తొలుగునె మనసా - కాలపాశములన్ని కడకును రాబోవు నిర్మలంబుగ వుండు మనసా ॥యి॥ పాతకహరుడాని చిత్తమున దెలిసియు చింతన జేయవె మనసా - అంతరంగములోన శివుని దలచుచు నీవు చెంత జేరుండవె మనసా ॥యి॥ సంగమేశ్వరుడె సర్వము తానని

యేల తెలియదు మూఢమనసా - మంగళస్వరూపు డై యుండియు తాను మహిలోన వెలుగునె మనసా ॥యి॥ ధరలోన పుష్పలధడలోన శివ రామదాసుడు పలికెనే మనసా - నిరతాము మదిలోన మరువక యెప్పుడు స్మరియింపుచుండవే మనసా ॥యి॥

### 3 మాయామాళవగౌళ రాగం చాపు ఆట తాళం

మంగళహారము గురుని జేరి నీవు హాయిగుగా భజియించు మనసా - గంగయమునల నడుమ వుండె రంగామృతము భృంగమై గ్రోలవె మనసా ॥మం॥ అంగలింగంబుల సంధి దెలుసుకోని రంగడ్ని జూడవె మనసా - పొంగుచు నీలోన నిరతంబు యెప్పుడు వెలుగుచు వుండునె మనసా ॥మ॥ శ్రీరామనామము చింతన జేసితె చింత లోదులునె నీకు మనసా - పారంబులేని యీ సంసారసాగరము యీదనౌను నీకు మనసా ॥మ॥ శ్రవణ మనన నిధి ధ్యాసాల యందున శ్రద్ధను వుంచవె మనసా - శమదమ వుపరతి శాంతిసమాధులు సలుపుచు వుండవె మనసా ॥మ॥ జీవకోటుల నెల్ల పోషించె ధాముడని మదిలోన మరువాకె మనసా - భావములోపల భక్తితో దలచితె భ్రాంతులన్నియు తొలగు మనసా ॥మం॥ యీధర లోపల వెలివే త్రిపురములో రామగురు డున్నాడె మనసా - సాదరంబుగ వారి కరుణాతో శివరామదాసుడు తెలిపెను మనసా ॥మ॥

### 4 శంకరాభరణము రాగం ఆట తాళం

వారం భజే బుధ వారంభజే శ్రీహరిం భజే పురహారంభజే ॥వా॥ విష్ణుం భజే వుత్కృష్ణం భజే శ్రీకృష్ణం భజే బాలకృష్ణం భజే ॥వా॥ నామామృతంబును పానంబు చేసినధామంబు యగు నిజరామం భజే ॥వా॥ నందం భజే గోవిందం భజే ఆనందం భజే నమల నందం భజే ॥వా॥ పరాపరంబుకు పరుండనయ్యీన దురంబులను బాపె మేలుం భజే ॥వా॥ రాకపోకలు గల రాపటంబులు బాపె ఏకాత్మకును వేగ పతిం భజే ॥వా॥ ఒక్కడై సర్వంబు పిక్కటిల్లుచు నుండి మిక్కిలై వున్నట్టి గురుం భజే ॥వా॥ యోగభో

గంబులు త్యాగంబు శేసిన యోగీంద్రులకును క్షేమంబు జేసిన॥వా॥ ధరలోన వెలిపేర్తి పురమందు నిత్యము దురములు బాపిన కృషి కేశం భజే ॥వా॥ దాసుదాసుఁడైన శివరామదాసుని యాప ణముల బాపె యీశం భజే ॥వా॥

### 5 సావేరి రాగం చాపు తాళం

గురువార మని నీవు గురుతు దెలుసుకోని గురుభజన జెయ్యవే మనసా - గురుడు నరుడుగాదు హరుడని యని నీవు నిరతము మరువకే మనసా ॥గు॥ గురుమంత్రముల యెపుడు గురిలోన వుంచుకొని స్మరియింపుచుండవే మనసా - ఇహపరా సుఖముల యిచ్చుయిం చక నీవు ఆహంబు వదలవే మనసా ॥గు॥ ఆరిటి కంటక ముడింటి మీదుగ ఏకముగ వున్నాడె మనసా - ఆరుమూడిటితోను జోడు కూడుకోని యేడ చూచిన తానె మనసా ॥గు॥ దేవదేవుల కెల్ల దేవుడే గురు డని మర్మమును తెలియవే మనసా - భావమందున నీవు భక్తితో నమ్మితె నిజదేవుని తెలుపు మనసా ॥గు॥ యెంత జెప్పిన వినవు యేమందు యిక నిన్ను సంశయము జెందకే మనసా- అంతరంగములోన చింతలొదలియు గురుని చెంత జేరుండవే మనసా ॥గు॥ ధరలోన వెలిపేర్తి రామచంద్రుని నీవు ఏప్రొద్దు మరవకే మనసా-శివరామ దాసుకు సిరి నీవె యనుచును మరి నమ్మి యున్నాడు మనసా ॥గు॥

### 6 మలహరి రాగం ఆట తాళం

శుక్రవారమునాడు చక్రధరుని నీవు సేవ జెయ్యవె వెర్రి జీవా - దిక్కు దిక్కులు నిండి మిక్కిలైవున్నాడు నిక్క మిది తెలియద జీవా ॥శు॥ సనకసనందన మునీంద్రబృందము సదా నుతించిరి జీవా - జనకాది యోగులు జయశుకాచార్యులు నిరతము దలచిరి జీవా ॥శు॥ నారాయణుని నీవు పారాయణము జేయ యేల తెలియదు మూఢ జీవా - భారమే తనదని భక్తితో నమ్మితె భ్రాంతులన్నియు తొలగు జీవా ॥శు॥ హరిని గురుడని నీవు మరువకా

యెప్రొద్దు దలచుచూ నుండవే జీవా - గురుడె దైవంబని గురుతు దెలుసుకోని గురి దప్పకుండవె జీవా ॥శు॥ జన్మజన్మములకన్న పర జన్మ హెచ్చని మరి నీకు తెలియుటవ జీవా-యీ జన్మలో నీవు కడతేర వలసినది యిక వారి దొరకదె జీవా ॥శు॥ యీ ధరలోపల వెలి వేర్తి పురములో రామగురు డున్నాడు జీవా - సాదరంబుగ వారి కరుణతో శివరామదాసుడు తెలిపెర జీవా ॥శు॥

## 7 శంకరాభరణము రాగం అట తాళం

మందవారమునాడు గురుని అందముగ భజియించరా -యిందు నందున నిండియుండిన సమరసైక్యత జెందరా ॥మంద॥ యెందు జూచిన తానెరా జగమంత జూచిన తానెరా - అందమయిన గురుని జేరితె సంధి నీకు దెలుపురా ॥ మంద ॥ మూల మేమి లేనిదానికి మూల మైనది చూడరా - ముల్లు మోపను సందు లేక అంత తా నైనాడిరా ॥మంద॥ వాదభేదము లన్ని మాని వేడుకతో భజయించరా-ఖేదమోదము లన్ని మానితె భేదరహితం బౌనురా ॥మంద॥ దైవ మనుచు గురుని నెప్పుడు భక్తితోను దలచరా-పావనం బైనట్టి పరమా పదవినీ జెందించురా ॥మంద॥ యీడుజోడు లేనివాడు వాడవాడలో తానెరా - వేడుకతో శివరామదాసుడు నేమముతో భజియించురా ॥ మంద॥

వారసప్తక భజన తరంగము సంపూర్ణము

# అఖండాద్వైత భక్తి తరంగము

### 1 ఆనందభైరవి రాగం ఆది తాళం

శంకర భజనలు శేయండి యమకింకర భయముల వీడండీ–మంకు
ంబుల వదలండీ గురు వాజ్ఞకు లోబడి నడువండి శివ ||శ|| గురుదే
ం డని తెలియండీ మీరు వరునిగ చూచుట తగదండీ – శరణని
ు చెయ్యండి సామీప్య పదవినీ చెందండీ శివ ||శ|| వాదభేధ
ు యేలండి మీరు క్రోధగుణంబుల వదలండీ – సాధన లెల్లను
నండి సారూప్య పదవినీ జెందండీ శివ ||శ|| కాయము నిల్వదు
డండి మీరు మాయలో బడుటా తగదండి – కామము లన్నియు
ండి సాయుజ్య పదవినీ చెందండీ శివ ||శ|| అష్టమదంబుల విడు
మీరు దుష్టగుణంబుల ద్రుంచండీ – కష్టము లన్నియు లేవండి
త్వ పదవినీ చెందండీ శివ ||శ|| సత్యము బ్రహ్మము నమ్మండి
త్యబ్రహ్మాండము జిమ్మండి – చిత్తములోపల తరచండీ మీరు
కలన్నియు మానండీ శివ ||శ|| భారలింగమును నమ్మండీ మన
లన్నియూ తొలుగండీ – గురుమంత్రంబులు తరచండి మీరు
ము జెందుట నిజమండి శివ ||శ|| ధరణీలోన వుప్పాలధడియలో
ామదాసుడు పలుకండి – మరువక సద్గురు సేవ జేయుచును
శుని సన్నిధి జేరండి శివ ||శ||

### 2 కలహరప్రియ రాగం ఆది తాళం

గురురాయ నిను నేను మరువాజాలను నినుమరువా జాలను –
మార లేకను కరుణా జూడుము ||గు|| మండాలముల మధ్య పండీ
్నివు నీవు పండీవున్నావూ–అండా జేరియు నన్నుఆదారించుము
|| కామక్రోధము లన్ని కడకు జిమ్ముము నీవు కడకు జిమ్ముము–
మానము లన్ని తొలగా జేయుము ||గు|| యీపాణములు బట్టి
సీ వేయుము నీవు త్రోసీ వేయుము – మోసాము జేయాక
మరా జూపుము ||గు|| ఆరూచక్రములందు ఆడూచున్నావు

నీ వాడూచున్నావు-అర్ధారి శత్రూల అణచీ[illegible] ॥గు॥ ధర ణీలో శివరామ దాసూ వేడెను రామదాసూ వేడెనూ - కరుణాతో బ్రోచీయు పరమూ జేర్చుము ॥గు॥

## 3 శంకరాభరణం రాగము ఆట చాపు తాళం

యంతాని బోధింతుర ఓమూఢజీవ యేమూని వర్ణింతురా - అంత యింతని తెలుపరానిది ఆది అంత్యము లేనిది - చిత్తమున శివ రామదాసుని స్థిరము జెందిన పదవినీ ॥యం॥ యిందు అందన రాకను ఓమూఢజీవ యెంచు తానే వున్నదీ-అందు యిందు యెందు చూచిన సందులేని బ్రహ్మ మాయను - మందమతులకు అందబోక ఆంతటా నిండున్న దదుగో ॥యం॥ యెరుక మరుపులు లేనిదీ ఓ మూఢజీవ యేకమై తా నున్నదీ - అరుగు తరుగులు లేక యెప్పుడు నిరత మొక విధమయిన పదవిని-మారుపు జెందక నున్న వారికి గురుతు లేక వున్న దదుగో ॥యం॥ పట్టూ విడుపులు లేనిదీ ఓమూఢజీవ దిట్టామై తా నున్నది - పట్టిమాటలు గావు చెప్పెద గట్టుగా గురు సాజ్ఞ చేతను - పట్టు వదలక నున్న వారికి బట్టబయలై వున్న దదుగో ॥య॥ దేశికుని కృపచేతనూ ఓమూఢజీవ ఆశ లన్నియు బాసెను- వాసిగా వెలివేర్రి రామదాసు దెలిపిన బోధ నమ్మితె - మోస మేమియు లేక యెప్పుడు సతత మొకవిధమైన పదవిని ॥య॥

## 4 తోడి రాగము ఆట తాళం

గురురాయ నీకు దయ రాదుగా సద్గురురాయ నీకు దయ లేదుగా మద్గురురాయ నీకు దయ రాదుగా ॥గు॥ దండిదాత వని వింటినీ గురువే నిండుదయ యిటు జూపు మంటినీ-అండ జేరితి నన్ను ఆదరించుము దేవ పుండరీక వరద కోరీ భజించెద ॥గు॥ అహంబు వదలించమంటినీ గురవే సోహంబు నీ వనుకొంటినీ-కావావ నా లోన కంటిలో సాక్షివై పూని అన్నిట నీవె పొలుపొంద నిలచియు ॥గు॥ దాసదాసుడ నని యుంటిని గురవె దాపు జేర్చెద ననుకుంటిని - మోసపుచ్చక నీదు మోము జూపుము దేవ యెరుక మరుపుల బాప వేగా మె యిటు రావ ॥గు॥

7 కలహరప్రియ రాగము ఆటతాళం

యెంతని వేడుదు సద్గురుదేవ నిను - పంతము లేల నాపై చెంతకు జేర్పరాద ॥య॥ పంచభూతముల చంచల మణచియు - అంచితముగ నీవు ఆదరించుము దేవ ॥య॥ ఓపిక లేనివగు తాప దుఃఖంబుల - రూపణగించియు తాపము బాపవె ॥యం॥ తల్లివి తండ్రియు దైవము నీవె యని - యుల్లము నందున తిన్నగ నమ్మితి ॥య॥ రామ రామా యని కోరి భజించెద - తామస మేల నాపై దర్శన మివ్వరాద ॥య॥ పొందుగ వెలివేర్తి మందిర మందున - అందముగ బ్రహ్మానంద ముప్పొంగగ ॥య॥ ధరణిలో శివరామ దాసుడు వేడెను - అరమర లేకను కరుణతో బ్రోవరాద ॥య॥

8 కలహరప్రియ రాగం ఆదితాళం

శివశివ యనుడి శివుని భజింపుడి - శివా శివ యనుడి శివుని భజింపుడి శి॥॥ శివశివ యని నీవు శివుని భజించితె-భవబంధంబులు బాయును నీకు ॥శి॥ బూటక మాయను సూటిగ వదలుడి - నాటక ధారుని నటనలు కనుడీ ॥శి॥ యీశ్వర నామము నిత్యము తలచితె- శాశ్వత పదవియు సౌఖ్యము దొరుకును ॥శి॥ నందివాహనుని ఆనం దముతోడుత - అందముగాను మనసందున తలచుడి ॥శి॥ భూసురు డగు రామదాసుని దలచితె - యీశుని మర్మము సూటిగ తెలు పును ॥శి॥ ధరణిలో శివరాము దాసుని మొర విని - మరువక దల చితె మార్గము దొరుకును ॥శి॥

9 ఫీలు రాగము ఆదితాళం

శివశివ యని నీవు చిత్తమునందున చింతన చేయవె ఓమనసా- చింతన జేసితె చెంతకు జేర్చియు చింతలు బాపునె ఓమనసా ॥శి॥ పరిపరి విధముల పరువుల బారక పరిశోధించవె ఓమనసా - మరువక యెప్పుడు శరణని వేడితె పరము దెలుపునే ఓమనసా ॥శి॥ వాద భేదములు మానియు సద్గురు బోధను దెలియవె ఓమనసా - ఖేద

మోదములు చెందక నిరతము ఆదిని తెలియవె ఓమనస ॥శి॥ తాపత్రయంబుల చేతను నీవు తహాతహ పడకే ఓమనసా-ఓపికతోడుత ఆపరమాత్ముని ఆత్మలో కనవలె ఓమనసా ॥శి॥ యీధరలోపల శివరామదాసుడు యిటుల బలికెనే ఓమనసా - సాదరంబుగ సద్గురు వచనము ఆధారం బనె ఓమనసా ॥శి॥

## 10 కల్యాణి రాగం ఆది తాళం

కేశవా నీదాపు జేరితి పాపము లెడబాపరా మోసమూ జేయక నాదు మోహాము లెడబాపర ॥కే॥ అంతరంబున నీదు సేవయు సంతసముతో జేతురా - చింత లన్నియు బాపి నీ పద చెంత జేర్చవె కేశవా ॥కే॥ వాడవాడలయందు జూడ వేడుకగ తిరిగేవురా-యేడు మేడల పైగ నీ వానందముగ నిలిచినవురా ॥కే॥ అల్లనాడు ద్రౌపతికీ వలువలూ నొసగితివిరా - ఆ కుచేలుని బాధ మాన్పియు అర్థము లిచ్చితివిరా ॥కే॥ ధరణిలో వెలివేర్తిరాముల దాపున దరి జేరితి_కరుణతోడ నన్ను బ్రోవుము శరణు జేసి వేడెద ॥కే॥ దాసులకు దాసుడానై శివరామదాసుడు వేడెను - యీషణంబుల అణచి నీవు దాసునీ కావూమురా ॥కే॥

## 11 పీలురాగం ఆదితాళం

ఓరఘురామ శ్రీరఘురామ - మమూ దయ జూడవె శ్రీరామా ॥ఓ॥ చూపును రూపును లయమూ జేసెటి - చూటి దెలుపు మిక శ్రీరామా ॥ఓ॥ అంతయు నీ వని చెంతకు జేరితి-చింతలు బాపుము ఓరామ నా చింతలు బాపుము ఓరామ ॥ఓ॥ రాతిని నాతిగ ఖ్యాతిగ జేసిన-పతిత పావనుడ పరంధామ ॥ఓ॥ ధరణిలో నీవంటి దాతయు లేడని - దాపు జేరితిని శ్రీరామ ॥ఓ॥ వెలివేర్తి వాగ వేదాంత భాష - మలినము బాపర మహానీయ రామ ॥ఓ॥ ధరణిలో వృప్తాల ధడ శివరామదాసుడ - మరువక బ్రోవర శ్రీరామ ॥ఓ॥

## 12 ముఖారి రాగం ఆట తాళం

యేమని పొగడెదరా రామా నీమహిమా - యేమని పొగడెద యెంతని వేడుదు చింతలు దీర్చవేరా ॥యే॥ అందుయిందు జూడ

నిండి వున్నావురా - సందేహమును మాన్పరా శీతారామ ॥యే॥ నమ్మినవారిని నట్టేట ముంచితివు - నిమ్మళంబుగ నుండరా శీతా రామ ॥యే॥ అండజ వాహన అండజేరితి రార - ఆదరించియు బ్రోవరా శీతారామ ॥యే॥ దాసులి పాలిటి దైవము నీ వని - దాసుండు నిను నమ్మెరా శీతారామ ॥యే॥ దాసదాసుడ నని దాపు జేరిననాడ - దాసుని బ్రోవరాద శీతారామ ॥యే॥ పొంకుగ వెలి వేర్తి మందిర మందున - అందముగ నిలిచితివి శీతారామ ॥యే॥

## 13 కలహరప్రియ రాగం ఆది తాళం

చూడ చక్కని చిన్నదీ కడ మేకలోపుల నున్నదీ - మూడు రంగుల మేడలో జలక్రీడ లాడుచున్నదీ ॥చూ॥ అంతరంబున సేవ జేసితె చెంత జేర్చెద నన్నదీ - చెంత జేరినవారి కెల్ల పరము దెలుపుచు నున్నదీ ॥చూ॥ రూప నామ క్రియలు లేనిది రూపు దాపై వున్నదీ - రూపు దాపు చేసుకోని జ్యోతిరూపై వున్నదీ ॥చూ॥ నాద బిందు కళలకు ఆధారమే నే నన్నదీ - నాదభేధము లేక చూచితె యేకరూపై వున్నదీ ॥చూ॥ ధరణిలో వెలివేర్తి గాముల దాపు జేరు మన్నదీ-దాపు జేరినవారి కెల్ల జన్మరహితం బన్నదీ ॥చూ॥

## 14 శంకరాభరణం రాగం అటతాళం

పతితపావన రామ పాలించు శ్రీరామ - కౌసల్యసుత రామ కరుణాలలామ ॥ప॥ నమ్మినవాడను నాథ శ్రీరామ - సొమ్ము నీదై వున్న సన్మతింపుమా ॥ప॥ కరిని రక్షించిన కాకుత్సరామ- కరుణాతో బ్రోవుము ఖగపతి రామ ॥ప॥ గుహుని రక్షించిన గుణనిధి రామ - అహంబులుడు బాపు అయోధ్య రామ ॥ప॥ ఓ రామ రఘురామ వైకుంఠ రామ శ్రీరామ నను బ్రోవ దయ రాద రామ ॥ప॥ వెలివేర్తి లోపల నెలకొన్న రామ - సలలితంబుగ బ్రోవు సద్గుణధామ ॥ప॥

## 15 కరహరప్రియ రాగం ఏకతాళం

నిన్నే నమ్మితీ నీలమేఘశ్యామ - నిన్నే నమ్మితీ నీలమేఘ శ్యామ ॥ని॥ నిన్ను నమ్మినాను నన్ను బ్రోవవయ్యా - పంత మేల

నాతో పావనాంగ నేడు ॥ని॥ చిన్ననాటినుంచి చెల్మి జేసివాడ - నన్ను బ్రోవ నీకు సమయ మిదే దేవ ॥ని॥ తాప మేలనయ్యా పాపాపి పై నీకు ఆపదాల బాపి కాపాడ రావేల ॥ని॥ దాసదాసు డాని దాపు జేరితిర-మోసపుచ్చకను మొర వినరాద ॥ని॥ రామరామ యని కోరి భజించెద - కామమూల ద్రుంచి కాపాడ రావేల ॥ని॥

**16** కేదారి రాగము ఏక తాళం

పూజ సేయరే రాముల పూజ సేయరే - పూజ జేసే భక్తు లాను పరము జేర్చును ॥పూ॥ భజన సేయరే రాముల భజన సేయరే - భజన జేసే భక్తులాకు భయము లేదనె ॥పూ॥ చింత జేయరే గురుని చింత జేరరే-చింత జేరితే సంతసమున చింత బాపును ॥పూ॥ మూటినడుమును త్రికూటమందున-సూటిగాను నిలచి నీవు వేడుకొనరె ॥పూ॥ సుందరయానరో సందేహ మేలనే-అందు యిందు యెందు చూచిన నిండి యున్నడే ॥పూ॥ వేగముగను వెలివేర్తి రాముల నిక్క - ముగ నమ్మితేను నిజము తెలుపును ॥పూ॥

**17** కరహరప్రియ రాగం ఏక తాళం

రామ నిన్నే నమ్మినాను నా మొరాలకించరా - భానుకోటి సుందరూడ ప్రేమతో నను బ్రోవరా ॥రా॥ కాటుకా పక్షూల మధ్యన నీటుగా నిలిచినవురా - సూటి దప్పక నిన్నునే నొక దీక్షతో సాధింతురా ॥రా॥ అందు యిందు యెందు జూచిన నీవు లేని చోటు లేదు-యింకధరుడా వనుచు నిన్నే దీనుడానై వేడితి ॥రా॥ పంక జాక్ష పరమపురుష పాలనా సేయుము రామ - సంకటంబుల బాపి నీ పద చింత జేర్చుము రాఘవా ॥రా॥ నీలమేఘశ్యామ రామ నిజ ముగా నమ్మితిరా - నీలతోయద మధ్యమందున నీటుగా నిలచితివిరా ॥రా॥ భాసిగా వెలివేర్తిలోన నీటుగా నిలచితివిరా - దాసు డగు శివరామదాసును ప్రీతితో నను కావరా ॥రా॥

**18** నీలాంబరి రాగం చాపు తాళం

నను బ్రోవ మని జెప్పవె ఓ సత్యమ్మ - నను బ్రోవ మని జెప్పవే ॥న॥ నను బ్రోవ మని జెప్పు నాథునితోడను - కరుణించి

బ్రోచెటి పరమ పావనివన్ను ॥న॥ పంచభూతంబుల చంచాలమున వైచ-సంచితాదుల బట్టి ద్రుంచి వేయుమని ॥న॥ యెంతని వేడుదు కాంతునికి దయరాదు - పంతాము లేకను చెంతా జేర్చుమని ॥న॥ చిత్తమందున నెపుడు చింతజేయువాడ - సత్తు చిత్తుల దెలిపి వుత్తమ పదవి జేర్చు ॥న॥ దాసదాసుడనాని దాపు జేరినవాడ - యీపాపాణ ముల నన్ని త్రోసివేయు మని ॥న॥ ధరణిలో వెలివే ర్తి ధాముడే నిజమాని - గిరతాము మదిలోన వర్ణింతు నని తెల్పు ॥న॥ దాస దాసు డయిన శివరామదాసును - మోసము జేయక రక్షించ మని తెల్పు ॥న॥

## 19 గౌళ రాగము ఏక తాళం

శరణు జేసెదను గుణుడ దుర్గుణముల బాపవె హరుడ - శరణు జేసెదను పదియునూర్లును - అరమర లేకను ఆదరించవే ॥శ॥ నామ రూప సాకార అనామరూప ఆకారనేమము తోడుట నిను భజియిం చెద - కామము లెల్లను కడకు జిమ్మ్రము ॥శ॥ నిరుపేదకుడను నేను నకు దొరికితి విక నిను విడను - పరమదయాళుడ పద్మనేత్రుడ- పరము జేర్చెటి ప్రభురాముడ పని ॥శ॥ మందరగిరిధర రార నా మదిలో నిను దలచెద రా - సుందరకారుడ సూత్మ్రరూపుడ - అందము తోడుత నిను భజియించెద ॥శ॥ చక్కని స్వామీ రార నా చిక్కు లన్ని బాపరా - ఒక్కడవే యని మక్కిలి నమ్మితి - మక్కువతోడను మాట నిల్పుకో ॥శ॥ వసుమతి వెలివే ర్తీశ నిను దలచెద భువన ప్రకాశ - దాసుల పాలిటి దైవము నీ వని - దోసి లొగ్గె శివరామ దాసుడు ॥శ॥

## 20 పూరికల్యాణి రాగం ఆది తాళం

స్మరియింతు పరంధామ శ్రీరామా బ్రోవవె-శ్రీరామ బ్రోవవే రఘురామ బ్రోవవే ॥స్మ॥ కేశావ మాధవ క్రిష్ణ దామోదర-మోసాము జేయకాను దాసుని కావవే ॥స్మ॥ మంద రోద్ధారుడ సుందరకారుడ-సందేహా మేల నాపై సమయా మిదే సూడరా ॥స్మ॥ అచ్యుత గోవింద ఆదినారాయణా - సచ్చిదా

నందరూప చెంతా జేరితిరా ॥స్మ॥ నీ మాయ దెలియ తరమ శ్యామసుందరుడ-కోమలాంగుడ వని కోరి భజియించితి ॥స్మ॥ అంత నీ వయ్యనావు చెంతా జేర్చావురా-పంతాము యేల నాపై చింతా బాపుమురా ॥స్మ॥ దీనబంధూడ వని సన్నూతించెదరా - మన్నాన జేయు మింక నిన్నే నమ్మితిరా ॥స్మ॥ వేద వేదాంతవేద్యుడ వెలి వేర్తి వాసుడా - సాధు శివరామదాసుడు కోరి భజియించెరా ॥స్మ॥

## 21 మలహరి రాగం చాపు తాళం

చిలుకన్న చిలుకవె బంగారు చిలుకవే పంచవన్నెల రామ చిలుకా - అలుకేల నీకును పిలచిన పలుకవు పాలించవే రామ చిలుకా ॥చి॥ యేడేడు పదునాల్గు లోకములు దిరుగుచు యేడ చూచిన నీవె చిలుకా - యేడింటిమీదుగ యేకరూపముతోను వెలుగుచూ నుందువే చిలుకా ॥చి॥ తల్లితండ్రులు లేని పిల్లవలె నేనెంతో తల్లటించితి రామచిలుకా - యుల్లమందున నీవు కొల్లగా వెలుగుచు మళ్ళి చూడవ రామచిలుకా ॥చి॥ అంతరంగములోన అంతఃకరణాములను ఆడించుచున్నవే చిలుకా - వంతుకయ్యనగాని బ్రోవకా తప్పదు పంతంబు యేలనే చిలుకా ॥చి॥ చిక్కు-చీకటి లోన చిక్కులో విడచియు త్రొక్కి- చూడవ రామచిలుకా - దిక్కు-యెవ్వరు లేరు నీకన్న ఓక్కలి దక్కించుకో రామచిలుకా ॥చి॥ శరణన్నవారిని కరుణించె దనుచును బిరుదు వహించితివి రామ చిలుకా - స్మరియింపుచున్నాను కరుణతో బ్రోవకా మరి నీకు ధర్మమా చిలుక ॥చి॥ అండపిండములోను దండిగా వెలుగుచు పండువై వున్నావె చిలుకా - అండ జేరితి నన్ను ఆదరించియు నీవు పరము దెలుపవె రామచిలుకా ॥చి॥ వాదబేధంబుల పాదు పెక లించియు క్రోధంబులను బాపు చిలుకా - నాదబిందుకళల కాధా రమే నీవు నన్నేడబాయకు చిలుకా ॥చి॥ ధరలోన వెలివేర్తి వరదుడూ నీదాపు జేర మని తెలిపెనే చిలుకా - శివరామదాసుడు సిరి నీవె యనుచును మరి నమ్మియున్నాడు చిలుకా ॥చి॥

**22** కల్యాణి రాగం ఆది తాళం

అంబవే జగదాంబవే శారదాంబవే కరుణించవే - మండలా మధ్యమున నీవు దండిమాత వైనవె ॥అం॥ నిన్ను నమ్మినవారి కెల్ల నిజము దెలుపుచు నున్నవె - నిన్ను నమ్మని మూర్ఖజనులకు అహామే గతి అంటివే ॥అ॥ మూలమేమి లేనిదానికి మూల మయ్యే వున్నవే - నీలతోయద మధ్యమందున జ్యోతిరూపం బైనవే ॥అ॥ కన్ను గానక తిరుగువారికి కాలపాశ మైనవే - కనులు మూసి కనులు తెరచిన ఘనుల కగుపడుచుందువే ॥అ॥ ధరణిలో శివరామ దాసుడు మరువకా నిను దలచునే-అరమరా చేయాక నీవు ఆదరించి బ్రోవవే ॥అ॥

**23** ముఖారి రాగం ఆది తాళం

యేదయా కడతేరె మార్గము-యేదయా గురుడా దేవ ॥యే॥ అహంభావము వదలి నీవు సోహ మనే పదవి జేందితే-మోహమూ లన్నియు నిర్మూల మవునూరా ॥యే॥ అంతరంగములోన గురుని చెంత జేరి వుండుమంటె-చిత్తచలనముతోటి మనసు చెదరి పోతుంది గురుడా బెదరి పోతుంది ॥యే॥ వచ్చిపొయ్యే దారి దెలుసుక వయి పుగా నీవు నిలచివుంటె - పంచభూతము లన్ని పటాపంచ లౌనురా జీవా నిలచిపోదువురా ॥యే॥ పుట్టుగిట్టూ లేని పదవి గుట్టు దెలుసుక వుండుమంటె - పట్టివిడచి లేనిమనసు పారిపోవునురా గురుడా చెదరి పోవునురా ॥యే॥ షోడశాక్షరి భావము దెలసి ద్వాదశాక్షరి నమ్మి వుంటె-వాదభేదము లన్ని వీడి నిలచిపోవునురా మనసూ కుదిరిపోవు నురా ॥యే॥ భేదవాదము లన్ని మాని భేదరహితం బైతె నీకు బాధలూ లేవాని శివరామదాసు దెలిపెను రాజీవా మరువబోకు మురా ॥యే॥

**24** మలహరి రాగం చాపు తాళం

పోదాము పదవే ఓమానస పోదాము పదవే-పోదాము పదవే ఇక సమ్మాతితో మనము అందమైన గురుని ఆనందముగ జేరా ॥పో॥

ప్రొద్దుప్రొద్దున లేచి వద్దజేరితే గురుడు - బద్ధపామరముల శ్రద్ధాతో
ద్రుంచును ॥పో॥ మేటిపురములో వుండె నాటాకధారుని - సూటిగ
కనుగొనె బాటను దెలియాను ॥పో॥ సన్నంపు డిడ్డిలో తిన్నాగ
దూరితే - యెన్నగరానట్టి వేదూక నూతినము ॥పో॥ దీటులేనటు
వంటి మేటాధికారుడు-వాటముగా సంశయ బాటబాసిను మనము
॥పో॥ ధరణిలో శివరామ దాసుని మననవిధి - అరలేక దాసుల
కరుణాతో బ్రోచునట ॥పో॥

## 25 ధన్యాసి రాగం రూపక తాళం

అశించితి నీపదములు పోషించవె శ్రీనివాస - మోసంబును
జేయకుము దాసుండను దరి జేర్చవె ॥ఆ॥ చేపట్టవె నను శేష
శయన దోషగుణంబుల యెంచకాను-తాపంబును పోదోలను దాపె
వ్వరు నీవే కద ॥ఆ॥ పాలభాగముకందు లీలాజోతుల నందు -
వాలాలాడుచు నుండె పరలింగమూర్తి వని ॥ఆ॥ నారాయణ నీనా
మము యేమారక భజియించెద - కరుణాతో నను బ్రోవ సరగూన
ఇటు రావ ॥ఆ॥ శరణాగత రక్షకు డని శివరాము దాసుడు నిను-సరి
దాతలు మరి లేరని కోయి జాచితి చేపట్టవె ॥ఆ॥

## 26 తోడి రాగం ఆది తాళం

గోపాల పాలబడితిరా కాపాడ వేగమే రార - యేపాప
మెరుగనివాడ గోపాల తాప మేటికిరా ॥గో॥ పుండరీకని కొర
కయ్యె పండరిలో నిలచితివయ్యె - అండ జేరినవాడనురా గోపాల
ఆదరించరా ॥గో॥ తెలిసీ తెలియనివాడనురా గోపాల అలుక
యేలనురా - నిలుపైతే లేనివాడనురా గోపాల పలుక వేలనురా
॥గో॥ కాయములో జేఱకోసిరా గోపాల వేఱ జేయకురా -
మాయాను పీడ జేయుమురా గోపాలా నీవె కాదటరా ॥గో॥
కర్తావు భోక్తవు నీవే గోపాల కారణము నీవె - కీర్తిపరుడావు
నీవెరా గోపాల శాశ్వతుండవుర ॥గో॥ ధరణిలో వెలవెర్తిలో
పలా గోపాల రామచంద్రుడవై - శరణూ జొచ్చినవారినీ గోపాల

పరము జేర్చితివి ॥గో॥ దాసులలో శివరామదాసుడూ గోపాల నమ్మియున్నాడు - అరలేక దాసునీ బ్రోవ గోపాల మరుగు యేలనురా ॥గో॥

**27** శంకరాభరణ జన్యరాగం ఆది తాళం

గంగా యమునలు దాటుదమూ రంగని భజనలు జేయుదము- అంగలింగముల సంధి దెలసి పరలింగమందున జేరుదము ॥గ॥ తాపత్ర్యయముల వీడెదమూ ఏకాంతంబుగ జేరుదము - ఓపిక తోడుత ఆ పరమాత్ముని చూపు నిలిపి భజియించుదము ॥గ॥ మూడునదులను దాటుదము ముక్తిద్వారమును తీయుదము- వేడుక చేతను రంగని జేరుక లీనమయ్యి తా నిలచెదము ॥గ॥ అయిదు అయిదులు యిరువై అయిదు అంటు బాసియు నిలచెదము - పాయక రంగని సేవ జేయుచును పరమపదవిలో చేరుదము ॥గ॥ ధరణిలోన వెలివేర్తి రాముల దైవ మని భజియించెదము - మరువక సద్గురు సేవ జేసియు రంగని సన్నిధి జేరుదము ॥గ॥

**28** మోహన రాగం ఆది తాళం

క్రిష్ణా వేగమె రావయ్యా గోపాలా వేగమె రావయ్యా ॥క్రి॥ హరిహరి యని నిను కరి మొర లిడినను - పరుగున బోయి మకరిని ద్రుంచిన ॥క్రి॥ రాతిని నాతిగ ఖ్యాతిగ జేసిన-భూతలమున ప్రఖ్యాతిని గాంచిన ॥క్రి॥ తండ్రిబాధలకు తగ ప్రహల్లాదుడు - తలచిన స్తంభములో వెడలితివట ॥క్రి॥ అన్న రావె యని అల ద్రౌపతి వేడ - తరుగని వలువలు తక్షణ మిచ్చిన ॥క్రి॥ నేమము తోడుత నిను భజియించెద - కామము లెల్లను కడకును జిమ్మను ॥క్రి॥ శాంతమూర్తి వని చాల నమ్మితిని - చింతలు బాపియు చెంతకు జేర్చవె ॥క్రి॥ సరసిజవందిత సురనర పూజిత - ధరలో శివరామ దాసుని కడకు ॥క్రి॥

**29** కీరవాణి రాగం ఆట తాళం

కొట్టరా భేరీ కొట్టరా గురుసమము లేరని - కొట్టరా భేరీ కొట్టరా గురుసమము లేరని ॥కొ॥ పట్టుగా గురు పాదములను

స్తతో పూజించితేను - దిట్టముగ వెలిగేటి జ్యోతిని స్పష్టముగ
గాపించనాయె ॥కో॥ యెక్కడాని వెతుక నేల నిక్కిచూడు
ంక్కంటిలోన - దిక్కులు నిండియుండిన చక్కనీ స్వామీని చూచి
॥ పంచవింశతి తత్వములకు మించి యుండిన ఆత్మ నీవని -
ంచరానిది దీనికన్న మించినది యెరింతు ననెను ॥కో॥ రాని
నీ బయలునందున లేనిపోని యెరుక కలదని- కానిమాటలు పల్కి
ప్టి కల్పకుడు లేడనుచు మదిలో ॥కో॥ వాసిగా వెలివేర్తి రామ
సుడు శివరామదాసుకు - మోసమూ లేకాను పరమపదవినీ జెం
చెనాని ॥కో॥

## 30 మాయామాలవగౌళ రాగం చాపు తాళం

శ్రీక్రిష్ణా రావయ్యా చింత లన్నియు బాప - చిన్నికృష్ణా
కూల బెట్టాకు చక్కనయ్యా రావె చిన్నికృష్ణా ॥శ్రీ॥ దాసుని
పములు వేగామె బాపవె చిన్నిక్రిష్ణా - మోసాము జేయక
రాసట్ల బ్రోవవె చిన్నికృష్ణా ॥శ్రీ॥ నిన్నుమినహా పరులు యితరు
వ్వరులేరు చిన్నిక్రిష్ణా - నిన్నూ నమ్మి వున్నవాడాను గదనయ్యా
న్నికృష్ణా ॥శ్రీ॥ సంకటముల బాప సకలాధిపతివయ్య చిన్నక్రిష్ణా -
ంకుతనమూ లేల కాపాడవలెనయ్య చిన్నిక్రిష్ణా ॥శ్రీ॥ యెక్కడ
గాచిన ఒక్కడవేనయ్య చిన్నిక్రిష్ణా-దిక్కుదిక్కులు నిండి మిక్కిలై
న్నావు చిన్నిక్రిష్ణా ॥శ్రీ॥ యెన్నెన్ని బాధల పెట్టితి వీవయ్య
న్నిక్రిష్ణా - అన్నిన్ని బాధల ఆపదల కోపితి చిన్నిక్రిష్ణా ॥శ్రీ॥
యప్పాటికైనాను యిక దయ కలుగాద చిన్నిక్రిష్ణా - యెప్పాటి
యినాను తప్పాను తెలియాద చిన్నిక్రిష్ణా ॥శ్రీ॥ ముందు చెప్పిన
మాట మరచిపోతివ నీవు చిన్నిక్రిష్ణా - అధుడగదనయ్యా ఆదరించి
బోవు చిన్నిక్రిష్ణా ॥శ్రీ॥ ధరణిలో శివరామదాసుడు వేడెను చిన్ని
క్రిష్ణా - పరమపావన శౌరి పాలాన జేయుము చిన్నిక్రిష్ణా ॥శ్రీ॥

## 31 ధన్యాసి రాగం ఏక తాళం

పాండురంగ రార - నన్నేలుకోవదేరా - పండరిలొ చేరుకోని
ండజేరరాదా ॥పా॥ జాగు లేల చేసెదావు భేద మేల రార - వేగ

ముగ వచ్చి నీవు ఆదరించవేరా ॥పా॥ చిటుకు మాంటె కోప మయితే యెటుల జేసెదారా - భటుడ నయ్యానాను యింక కుటిల మెందుకురా ॥పా॥ నీలవరణ నిన్ను నమ్మితి నన్ను బ్రోవవేర-కాలకర్మమూల నెల్ల కడకు జిమ్మవేరా ॥పా॥ భక్తావత్సలుడవని భజన జేసెదారా-భక్తుల రక్షించ నీకు భారమాయనా రంగ ॥పా॥ యీాశు డనుచు మదిలో నిన్ను చాల నమ్మితీర - దాసుడైన శివరామ దాసు నేల రాదా ॥పా॥

## 32 కలహరప్రియ జన్యరాగం ఆట తాళం

యెటు జెప్ప నగునూ సద్గురు మహిమ - యెటు జెప్ప నగును మాటలచేత యెటు జెప్ప నగును ॥య॥ కుటిలగుణముల నెల్ల తటు కూన తెగవేసి - పటుతరముగ సద్గురుని జేరనివారి ॥య॥ నోట ఒక్కటి నుడివి నడక ఒక్కటి నడచి - నోటి కొచ్చినయట్లు మాట లాడెటివారికి ॥య॥ హంకార మమకారములను జెందివుండె - మంకుజనములు దీని మర్మము గనతరమ ॥య॥ సాధన సంపత్తి సద్విచారము మాని - వాద భేదములాను వదలాని నరులాకు ॥యె॥ నూటి కొక్కటి జెల్లు మాటాని తెలియుము - మాటిమాటికి వట్టి పాట లేటికి తెలియ అజునికితరమా ॥య॥ సద్గురువుల జేరి దుర్గుణ ముల అణచి సద్గురు చరణములు పూజించితే తెలియు ॥య॥ వట్టి మాటలు గావు గట్టు గురునితో తెలసి పట్టు వదలక వున్న వారికి తరమాను ॥య॥ ధరణిలో వెలివేత్రి రాముల కృపతోను-దాసు డైన శివరామదాసుకు బల్కె ॥య॥

## 33 కలహరప్రియ జన్య రాగం ఏకతాళం

గురుదేవ నన్నుబ్రోవ మన సేలరాదు దేవ - శరణాని వేడి తీర మరి నన్ను కావరాదా ॥గు॥ నిను నేను నమ్మితీర న న్నేడ బాయకూర - పన్నాగశయన రార న నాదరించవేర ॥గు॥ అప రాధమూల బాప వుపకారి వయ్య నీవు - నెప మెన్న కాను నీవు కృపతోటి నేలరాద ॥గు॥ యిలలోన నీతో సాటి ఘను లెవ్వ

ైరయ్య - కలలోన మరువనట్టి బలమూను జూపరాద ॥గు॥
శీలొ శివరామ దాసూని మొర విని - అరమార లన్ని మాని
గూన యిటకు రావె ॥గు॥

## 34 శంకరాభరణం రాగం ఆది తాళం

రామయా నన్ను కావను సమయము మిదె రావయా - భావ
ము యెపుడు నిన్ను భక్తితోను తలచెద ॥రా॥ పరమపురుష
స్మనాను పంత మేల బ్రోపరా - కరుణ యేలరాదు నీకు కమల
ంన వేడెదా ॥రా॥ బక్క బాప డనుచు నాపై అక్కసంబు కలి
-పెక్కు రీతులాను నేను ప్రేమతోటి తలచెదా ॥రా॥ అందరు
ంమము రారు యెంద రున్న యేమాయా - మందబుద్ధులాను
చి వేగముగ కావరా ॥రా॥ చక్కనయ్య వేగ రార చిక్కుల
ాకురా-ఒక్కముచ్చు టాడిపోను గ్రక్కున యిటు రావయా ॥రా॥
శిలోన వెలివే_ర్తి దాత వని నమ్మితి దాసులలో శివరామదాసు
రావయా ॥రా॥

## 35 కాఫి రాగం ఆది తాళం

పంత మేలనయ్యా రంగ చింత దీర్చవయ్య-అంతరమున నిను
ంతో నమ్మితి ఆదరించవయ్య రంగ ॥ప॥ కపట వేషధారి రంగా
ంను జూపవయ్యా - నెపము యేలయా నాపై నీకు కాపాడుము
ి రంగ ॥ప॥ దయను మరువకయ్యా నాయడ దాపుపుగనయ్యా-
ంము ఆయు నిక నమల మొందుటకు కరుణ జూడుము పరమదయా
॥ప॥ జారవిడువకయ్యా నా మొర ఆలకించవయ్యా - జార
ర విచారములో మది దూరుము చూడుము నీయడ నిలువదు ॥ప॥
న్ని జన్మములను యెత్తిన నిన్ను మరువకుందూ - నన్ను యేమ
అన్ని జన్మములు సున్న జేయు ఆపన్న దయానిధే ॥ప॥ దాస
సుడయ్యా శివరామదాసుడ గదనయ్యా - మోసము లన్నియు
ంల జేసియు యేసిన బిరు దిపు డేమొ తలంచుము ॥ప॥

## 36 కనడ రాగం ఆది తాళం

దయనూ మరువకురా జానకిరామ భయము జెందితిరా - దయను మరువకు భయముచేతను దిగులుజెంది వున్నవాడను - భయము బాపియు నయము చేతను కరుణ జూడు ముకుంద మాధవ ॥ద॥ జడుపు దోచెనురా శీతారామ గడపు చేయకురా - దుడుకు శేయకు దొరవు నీవని తలచి నమ్మితి ధర్మసాక్షిగ - కడకు దోలుము కర్మములు మరి కరుణసాగర కలుషభంజన ॥ద॥ యెంతో వేడితిరా శ్రీరఘురామ చింత దీర్చుమురా పంతమేటికి రార మ్రొక్కెద పలుక అనుమానించెదావు - చింత లన్నియు బాపి నీ పద చెంత జేర్చియు పలుకరించవె ॥ద॥ నీవె కావలెనా నన్నిటు నీవు వేరు జేసెదవా దేవదేవుడవానీ నిన్ను ప్రేమతోడుత పొగడుచుంటిని - వ్యాస టాయను నాదు మనసుకు దోష మెచ్చును సుమ్మి నీ కిక ॥ద॥ ధరలోన వున్న వుప్పలధడ పురమందు నున్నా - యిరువుతోడుత శివ రామదాసును కరుణ జేసి బ్రోవకున్నను - శిరియు నిన్నూ జేరనివ్వదు కరుణ కల్గును కాని చూచెవు ॥ద॥

## 37 శ్రీరంజిని రాగం ఆట తాళం

ఘల్లుఘల్లున రావయ్య వెంకటేశ తల్లటించుచున్నానయ్య వెంకటేశ ॥ఘు॥ యాగయోగంబు లన్నియు చేయలేదు - రాగ ద్వేషంబులన్నియు బాపవయ్యా ॥ఘు॥ పక్షివాహనుడావయ్య వెంకటేశ - సాక్షిభూతుడవు నీవె వెంకటేశ ॥ఘు॥ పాయక ముప్పయియెనిమిదేండ్లు దేవ - పంచ గాచి వున్నానయ్య వెంకటేశ ॥ఘు॥ మోసపుచ్చుట న్యాయమ వెంకటేశ - దోష మొచ్చును నీ కయ్య వెంకటేశ ॥ఘు॥ ప్రత్యగాత్మస్వరూపుడ వెంకటేశ - నిత్యనిరాకారూడావు వెంకటేశ ॥ఘు॥ ఆదిఅనాదులకు నీవు వెంకటేశ - ఆధారుడవు నీవె వెంకటేశ ॥ఘు॥ దాస దాసుడ గదనయ్య వెంకటేశ-శివరామదాసుని బ్రోవు వెంకటేశ ॥ఘు॥

**38** శంకరాభరణం రాగం ఆది తాళం

అదుగో సద్గుగుని రూపము ఓమనస కనుము అదుగో నిర్గుణ
ాపము-అదుగో చూడుము మిక హానహాతమందున కదలక చూడుము
మపాపలపై ॥అ॥ వాడవాడలాయందున ఓమనస తాను నిండి
యున్నాడు చూడుము - యీడుజోడు లేక ఏకరూపముతో యెందు
ాచిన సందు లేకను ॥అ॥ పంచభూతములందున ఓమనస యెపుడు
ంచిగున్నాడు తెలియుము - ఆశపాశముల అణగ జేసియును ఏక
ావముతో చూడుము నీలో ॥అ॥ యీషణంబులా బాసియు ఓమ
 స నీవు దోషగుణములా వీడియు - మోసపోక గురుసేవ జేయుచును
ాశుని పదములు నమ్మియుండియును ॥అ॥ ధరలో వెలివేర్తీ
ీపల రామదాసును నిరతాము మరువబోకని - పరము దెల్పేటి
మరాయుడు అని శివరామదాసుడు మదికి జెప్పెను ॥అ॥

**39** హరికాంభోజి రాగం చాపు తాళం

యితరదైనములను వేడ - యిలను సౌఖ్యమూ రామ ॥యి॥
శివి నీవె యనుచు మదిలో - సతతమూ నిను వేడుచుంటి ॥యి॥
న్ననాటినుంచి నీదు చెంత జేరి నున్నవాడ-అన్న రావె ఆలకించ
యు మీదె నన్ను బ్రోవ ॥యి॥ దాపు నీవె యనుచు నిన్ను
ిసి లొగ్గి వేడితీర-ఆపదాల బాపి నీవు కాపాడను వేగ రావ ॥యి॥
తలు జెంద నాకు యేల కథలు దీర్చి బ్రోవవేర - మతము మితము
కము జేసి సుతుని అట్టె కావరాద ॥యి॥ దేవదేవ నన్ను
ావ జాగు లేల జేసెదావు - భావమందు యెపుడు నిన్ను భక్తితోను
ంచెదాను॥యి॥తనువుమనము ధనము నీకు నాడె చెందివుండెనయ్యా-
ంతి జేయుచుండి నీలో ప్రణుతి జేయుచున్నవాడ ॥యి॥ దాస
ద రామచంద్ర దోష మేమి జేసితినీ-మోసమూ జేయాక శివ
మదాసు నేలరాద ॥యి॥

**40** శంకరాభరణం రాగం ఏక తాళం

కరుణించరా రామయ్యా నేను కరుణించర ॥క॥ మొరవిని
ా మోము జూపవేర-అరమార లేక ఆదరించ రార ॥క॥ ఒంటి

గుండలేను జంట బాయకూర - అంటిఅంట కాను ఆదరించవేర ॥క॥ గతి నీవె యని మది మరువక-సతతము నిన్నె నమ్మి వున్నగదర ॥క॥ శబరి యెంగిలయ్యె యెక్కు- వయ్యెనాద - అభయమిచ్చి నీవు ఆదరించ లేద ॥క॥ వృధత యేమి నీకు వ్రాడిగంబు లిచ్చె - కడకు జేరదీసి కాపాడితీవయ్యా ॥క॥ దొరవాని నీకు దోసి లొగ్గితీర - మరిమరి నిన్నే వేడుచున్న గదర ॥క॥ చిన్ననాటినుంచి కోరి వున్నానుర - పన్నగేంద్రశయన మాటలాడవే ॥క॥ వేడుకాతో శివరామదాసుడను - జోడు బాయకాను వేడుచుండెలేర ॥క॥

## 41 కాఫి రాగం ఆది తాళం

గరుడగమన రార నను నీ మరుగు జేర్చుకోర - కరివరదుడవని నిన్నే నమ్మితి మరచు టెందుకూర ॥గ॥ సిరియు సంపదలను నేను నే కోరి వేడలేదూ - సిరికి జెప్పకను సరగున బోయి కరిని గాచితివిరా ॥గ॥ యేల దయనురాదు శ్రీహరి పాల బడితిగదరా - కాల మంతయు గడచిపోయెను మోము జూపరాదా ॥గ॥ తలచి తలచి నిన్నే రాఘవ తల్లటించితీరా - వేళ మీరె యిక జాగు శేయకను వేగమే రావయ్యా ॥గ॥ ధరణిలోపలాను శివరామదాసుని కడ కయ్యా - నరహరి శ్రీహరి పరుగులు బారుచు బిరబిర రావయ్యా ॥గ॥

## 42 మలహరి రాగం అట తాళం

యెన్నడూ నీరూపు జూతురా శ్రీ వెంకటేశ - మన్న నేల చేయరావురా ॥యె॥అను॥ నిన్న మొన్నటివాడ్ని కాదు సన్నుతించ సమయ మిదె - కన్నులార జూచి నా తో కలిసి మెలసి యుండరాద ॥యె॥ వచ్చిపొయ్యే దారిలోన వయిపుగాను నిలచివున్న - మచ్చికాతో వచ్చి నీవు మాటలాడరాద యింక ॥యె॥ యీడుజోడు లేక యెప్పుడు వాడవాడలయందు జేరక - ఏడుకొండలపైన నీవు ఏకరూపై నిలచినావు ॥యె॥ భేద మేమిలేదు చదువు యేదియు చదువాగ లేదు - నీదు దయతోని మూఢుని వేధ లన్నియు బాప

వయ్య ॥యె॥ ధరణిలో శివరామదాసుడ దాపుజేరియున్నవాడను - మరుపు జెందకాను నీవు ముచ్చటాడనయ్యా నాతో ॥యె॥

## 43 తోడి రాగం ఏక తాళం

నిను భజియించెదరా శ్రీరామా నిను భజియించెదరా - నిను భజియించెద నీరజాక్షు డని నను దయజూడుము సీతమనోహర ॥ని॥ యుల్లమునందున చల్లని గాలిలో కొల్లగ వెలిగెటి కోమలాంగుడవు - జాల మహేంద్రాజాలుడ నీవె లీలలు జేయకురా శ్రీరామా ॥ని॥ యెంతని పొగడెద నీదు మహిమను చింతన జేసితె అంతు దెలియదిక - పంతము లేలను పావనచరితా చింతలు బాపుమురా శ్రీరామా ॥ని॥ కోరినవాడను వేగమె రార నేరము లెంచక నను దయ జూడుము - పరమదయాకర పంకజనాభుడ పాలన శేయుమురా శ్రీరామా ॥ని॥ ధరణిలో వెలివేర్తి ధాముడ వీవని మరూవక నెప్పుడు మదిలో దలచెద - పరము జేర్చెటి ప్రభురాయుడ వని పాదము నమ్మితిరా శ్రీరామ ॥ని॥



## 44 యమునకల్యాణి రాగం ఏక తాళం

నిన్ను నమ్మియున్నవాడ నన్ను బ్రోవవేమయా - పన్నగేంద్రశయన నిన్ను సన్నుతించ రావయా ॥ని॥ శరణు జేసెదాను నాపై కరుణ యేల రాదయా - అరమ రేల శేసెదావు - సరగున నను కావరా ॥ని॥ శత్రు లార్గురైతె నన్ను దక్కనివ్వరయ్య యో - మక్కువాతో వచ్చి నీవు గ్రక్కున నను బ్రోవరా ॥ని॥ అగడు జెందియున్నవాడ దిగులు బాపవేమయా - జగములోన యెదురులేదు వేగమే యిటు రావయా ॥నిను॥ నీలమేఘశ్యామ నిన్ను చాల నమ్మినానురా - జాలమేల శేసెదవు పాలన శేయుమురా ॥ని॥ దాసవరద దేశికేంద్ర దోష మేమి జేసితీ - దోసిలొగ్గి వేడినాను యీవేళ నన్ను కావరా ॥ని॥ యితర మెంచబోకర నా గతివి నీవె కావరా సతతము శివరామదాసుడు చాల నమ్మినాడురా ॥ని॥

## 45 మధ్యమావతి రాగం ఏక తాళం

భక్తపరిపాలక భక్తుల రక్షించరాద - ముక్తిఫలదాయకా భక్తితోను భజన జేతు ॥భ॥ జాల మేల జేసెదవు కాల మంత గడచిపోయె-లీల లన్ని జూపక నను పాలన జేయూము దేవ ॥భ॥ దీనజను బ్రోవరా దిక్కు- నీవె కాదటరా - మానసమున భజన జేతు మర్మ మేదో తెలుపరా ॥భ॥ ఆలనాడు భక్తులకు అభయంబు లిచ్చినావట - కల్లసంసారమును దాటించె ఘనుడవట ॥భ॥ సద యూడ వని నిన్ను స్మరియింపుచున్నాను - తుది నొం దేవరకు నా మదిలోన నిలువరాద ॥భ॥ సగుణారూపము తొచ్చి సుగుణాబోధను జేసి - సగుణాము లన్ని బాప సుగుణాకర దేవ రావె ॥భ॥ ధరణి లోన దాసులకు దాపు నీవె గదవయ్యా - కరుణాతొ శివరామ దాసు నేలవే దేవ ॥భ॥

## 46 శంకరాభరణం రాగం ఏక తాళం

పరమదయాకర పద్మలోచనా పంకజనాభ బ్రోవరా - మరు వక నెప్పుడు మదిలో దలచెద కరుణతోడ నను కావరా ॥ప॥ శంఖ చక్రధర సంకటంబులను చెంతకు జేరానివ్వకూ - పక్షివాహనుడ పంతము లేలను రక్షణ శేయను రావయూ ॥ప॥ అంగములోపల లింగరూపమై దండిగ వెలుగూచున్నవా-నిగమగోచరా నీసరి దైవము జగతిలో లేడని నుడివెదా ॥ప॥ భారము నీదని భక్తితొ నమ్మితి నేరము లెంచక రావయా - నీరజనయనా నిర్మలరూపా నిన్నె కోరి వుంటిరా ॥ప॥ దశరథరామ దానవభీమ కామము లన్నియు బాపరా- కేశవ మాధవ క్రిష్ణ దామోదర దాసుని తాపము మాన్పరా ॥ప॥ దాసదాసుల దాసు డైన శివరామదాసుడూ వేడెనూ - మోసము జేయక దాసుని బ్రోవను యూశే వేగమే రావయా ॥ప॥

## 47 కల్యాణి రాగం ఆది తాళం

వెంకటేశ నన్ను బ్రోవను చింత యేల నీకు రా-సంకటంబుల బాపి నీపద చెంత జేర్చవేమయూ ॥వెం॥ పిలచినాను పలుకవేల

ుక యేలా నీకురా - పలుకు లన్ని ఆలకించి మొలుకువా నను కువే ॥వె॥ పంచవింశతి తత్వముల కాధారమే నీవైతివి - సంచి దు లన్ని బాప సమయ మిదే చూడరా ॥వె॥ దీనలోకపాల నీవె ర్క - నన్ను కావరా - మానసమునా నమ్మినాను తామసంబు లరా ॥వెం॥ నీవె నేను నేను నీవె వేరు దలచుట యేలయా- వరాదా కరుణలేదా మాధవా నను బ్రోవరా ॥వె॥ రామదాస మ్ము బ్రోవను రాయబార మేలయా - తామసంబు లాను అణచి మ జూపవలెనురా ॥వె॥ పట్టి విడచుటకన్న దేవ ప్రాణ మిడ ట మేలయా-పట్టుమూ శివరామదాసుకు తక్షణమె నీకిప్పుడే ॥వెం॥

## 48 కీరవాణి రాగం చాపు తాళం

శ్రీలక్ష్మి ప్రాణేశ శీఘ్రమె రావయ్యా శ్రీనివాస - నీపాల నాను కాపాడి రక్షించు శ్రీనివాస ॥శ్రీ॥ రక్తాక్షిసంవత్సర శాఖమాసములో శ్రీనివాస - రక్షించు మని యెంతో మొరలిడితి య్యా ॥శ్రీ॥ యిప్పటి కయినాను యిక దయరాలేద శ్రీనివాస- దబ్బాంధవ ఆనాదిని బ్రోవు శ్రీనివాస ॥శ్రీ॥ తప్పేమి చేసితి ప్పవె నా చెడ్డ శ్రీనివాస - విప్పి చెప్పినగాని వప్పుగా నడచేద వాస ॥శ్రీ॥ పేదభక్తుండాని నీ దాయ జూపవ శ్రీనివాస - ఆప ను బాపి కాపాడవలెనయ్య శ్రీనివాస ॥శ్రీ॥ తల్లి తండ్రి దొర త కులదైవమును నీవె శ్రీనివాస - యుల్లమునందున నిన్ను మ్మనవాడ శ్రీనివాస ॥శ్రీ॥ కొరగాని నరుడాని కోప మొచ్చిన మొ శ్రీనివాస - పరిపరివిధముల ప్రార్థన జేసెద శ్రీనివాస ॥శ్రీ॥ ణిలో శివరామ దాసుడు వేడెను శ్రీనివాస - శరణు జొచ్చినవాడ వాక నను బ్రోవు శ్రీనివాస ॥శ్రీ॥

## 49 శంకరాభరణం రాగం ఏక తాళం

సమయ మిదే రావయా తామసంబు యేలయ - కామము అణచయా ప్రేమతో నను బ్రోవయా ॥స॥ నీరజాక్ష నమ్మితిని మెంచవలదయా - భార మంత నీదయా దారి దెలుపవేమయా

॥స॥ అంత నీవె యేూదువు యింత కోపమేలరా - చింత లన్ని బాపరా చెంత జేర్చవేమిరా ॥స॥ చిన్ననాటి నుంచి నీకు చెలిమి జేసినానయా - మన్న నేల జేయువు న న్నాదరింప రావయా ॥స॥ వంటిగైనగాని వచ్చి తంట లన్ని బాపరా - ఇంటిలోన యెవరు లేరు జంట నువన్నానురా ॥స॥ ధరణిలో శివరామదాసుడు మరుగు జేరినాడయా-తరుణోపాయమూను జేయ దొరవు నీవె కలవయా ॥స॥

## 50 కరహరప్రియ రాగం ఆది తాళం

మొర వినరా రాఘవా నా మొర వినరా రాఘవా - అర మర లేలను అతిథుడు వీ డని ఆదరించరా సాధురక్షకా ॥మొ॥ కరుణేల రాదురా కరివరదా బ్రోవరా - మరువక దలచెద మానస మున నిను పరమదయాకర పావనచరితా ॥మొ॥ నిన్నా నమ్మితిరా నన్నా రక్షించరా వేణుగోపాలుడ వేగమె రావయ - చిన్ని తనయుడను మన్నన జేయను॥మొ॥ పిలచితి పలుకవా అలుకేల నీకురా తలచి నేను తల్లటించినను - లీలలు జేయుట న్యాయము కాదుర ॥మొ॥ జాగేల రావయా నీచెంత చేరితయా నిగమగోచరా నీ సరిదైవము - జగమున లేదని బొగడుచు నుండెద ॥మొ॥ యీఆశా నను బ్రోవరా లోకేశా నను కావరా - దాసు డయిన శివరామ దాసుడు ఆశల బ్రోయుకు యీసమయంబున ॥మొ॥

## 51 శంకరాభరణము రాగం ఆట తాళం

సుగుణాకర దేవ కోరి నిను నమ్మితి - నగుణాములను బాప సరగూన యిటు రావ ॥సు॥ నీలదేహధారి నిర్మలస్వరూప - కల కాలమును నీవె కాపాడవలెనయ్యా ॥సు॥ భక్తులు నిను జేరి ముక్తికోరకై వేడ - రక్షించి వారికి ముక్తి దెలిపిన తండ్రీ ॥సు॥ భావములోపల భక్తితో దలచెద - కావావ నాలోన కంటిలో సాక్షివై ॥సు॥ చిక్కు లన్నియు బాప దిక్కు నీవనుచును - పెక్కువిధముల నేను ప్రేమతో తలచెద ॥సు॥ నిన్నా వర్ణన జేయ నే నెంతవాడను - సన్నుతించెద నీకు సరి యెవరులేరాని ॥సు॥

వేదవేదాతీత వెలివేర్తి పురవాస - వాదభేదరహిత నాదాతీతుడ వయ్యా ॥సు॥ ధరణిలో శివరామదాసుని మొర వినీ - యెరు కరుగే వరకును నీ కృప జూపవే ॥సు॥

## 52 మాయామాళవగౌళ రాగం ఆట తాళం

నమ్మ్యాతీనమ్మా ఓ సత్యమ్మా నమ్మ్యాతినమ్మా - నమ్మ్యాతి నిన్నయిన సమ్మాతితోడుత - పన్నాగ నేటికి పరిశుద్ధ మైతిని ॥న॥ అంటి అంటక నీవు ఆధార మయితివి - జంట బాయక వెనువెంట నంటున్నాను ॥న॥ తిరిగి జూడవదేమి కరుణాకు పాత్రుడ - పరిపరి విధముల మరి నిన్నే వేడితి ॥న॥ వెతకి వెతకియు నేను వేసరక జెందితి - సతతాము వేడితి గతి నీవె యనుచును ॥న॥ ధరణిలో శివరామదాసూని మొర విని - అరమూరలేలను దాసుని నేలవే ॥న॥

## 53 శంకరాభరణము రాగం ఆట చాపుతాళం

యెందూకు నను బ్రోవవూ సద్గురునాథ సందేహ మేల నయ్యా - యెందూకు బ్రోవవు సుందారకారుడ ముందు వెనుకను నీవు అందముగా నిలచియూ ॥యె॥ వేగమె రావదేలా యశోద తనయూ తామస మేల నాపై - జాగేల జేసేవు నీపాల బడినాను బాగుగా నేలవె భక్తాపరాధీన ॥యె॥ కోరి నిన్నే వేడీతీ సారస నయనా మారు బల్క వదేలరా-కరుణేల రాదుర కఠిన మెందుకు దోచె పరిపరివిధముల మరి నిన్నే వేడితి ॥యె॥ అన్నియు నీవె నయ్యా ఆనందరూప నన్నెడబాయకయ్యా - వెన్నూడ నిను జేరి వున్నవాడను నేను నన్నెడబాయకు నాథ మనోహర ॥యె॥ కోమ లాంగుడవాని వింటీ నన్ను వేమారబోకుమాము అంటి - నేమాము తోడుత భావములోపల కావు మనుచూ పదకమలాము వేడితి ॥యె॥ దాసదాసుడనాని అంటి రామదాసూడనై ముందె వుంటి - యీశ లోకేశ సర్వేశుడ వనుచూను శివరామదాసుడు మరి నిన్నె వేడెను ॥యె॥

## 54 కలహారప్రియ ఏక తాళం

గోపాలక్రిష్ణరావె ఆపాదలాను బాప - తాపంబు యేల నాపై కాపాడ వేగ రావె ॥గో॥ మురళీగానలోల మురియూచు వేగ రావే - అరమారలేల నాపై కరుణాతో బ్రోవరావ ॥గో॥ పుండారీకవరదా నా అండా బాయకూర - మండాలత్రయములాపై మహిమేల శేసెదావు ॥గో॥ కరిరాజవరద నన్నూ కన్నూల జూడ వేర-శరణూ జొచ్చినవాడ మరి నన్నూ కావలేవా ॥గో॥ యతిగణప్రాస మెరుగ గతి నీవే నిన్ను విడను - సతతాము నన్ను విడకూ మతిలోన నిన్ను మరువ ॥గో॥ రాధామనోహరా వాదేల చేసెదావు - ఆధారమూను నీవై అంతట నిండినావు ॥గో॥ ధరణిలో శివరాము దాసూని మొర వీని - మరి నన్నూ కావకున్న శిరి నిన్నూ మెచ్చ దయ్యా ॥గో॥

## 55 కేదారి గోళ రాగం ఏక తాళం

జయూజయహారతి జయూమంగళారతి - హారతి దేసిక ఆత్మ స్వరూపా ॥జ॥ చంచలగుణముల సుంకణగించియు - సంచితాదులు అన్ని సమయూ జేయూ మని ॥జ॥ కర్పురహారతి కాంతి చెలంగగా ఓర్పుతో మాయను తీర్పును జేతు వని ॥జ॥ చూపు మనసు రెండు ఏకము జేసియు - పాపలా వెలిగెటి ఆ పారంజ్యోతిని ॥జ॥ పొందుగ పుప్పల్ధడ మందిరమందున - అందముగాను మనసందూన యెప్పుడు ॥జ॥

## 56 ఖరహరప్రియ రాగం ఆది తాళం

మంగళ మని మంగళ మని మంగల మనరే - మంగళ మని పాడరే శ్రీ సత్యమాంబకూ జయ - మంగళ మని పాడరే శ్రీ రామచంద్రునకు ॥మ॥ వేడుకతో గురుని జెరె జాడ దెలియరే - జాడ దెలిసి జోడు గూడీ వేడుకోనరే ॥మ॥ పంచభూతమూలయందు మించి యున్నడె - సంచితాదు లన్ని బాసి వంచ నొదులరే ॥మ॥ నీలతోయదమధ్యమున నిలచి యున్నడె - చెలియ లందరును గూడి

సేవ చెయ్యరే ॥మ॥ ధరణిలో వెలివేర్తి రాముల దాపు జేరరే - ఆరమర లేకాను భక్తుల ఆదరించునే ॥మ॥

**57** ఆనందభైరవి రాగం చాపు తాళం

లాలి యని పాడరమ్మా లోకమును పాలించె దేవుడమ్మా - భావములో నిలుపరమ్మా సద్గురుని పూజించి వేడరమ్మా ॥లా॥ ఆగామిసంచితముల ప్రారబ్ధమును బాపె దేవుడమ్మా-కోదండరాముడమ్మా భక్తుల పోషించె ధాముడమ్మా ॥లా॥ షట్చక్రముల యందూ సద్గురుడు సంచారమును జేయుచుండు - అష్టదళపద్మమందు సద్గురుడు పూర్ణుడై నిలచియుండు ॥లా॥ యీషణంబుల బాపును మనలోని తాపముల పోద్రోలును - హాంకారమును ద్రుంచును సద్గురుడు ఆరుగుణములు గెంటును ॥లా॥ లోకైక వీరుడమ్మ యేడేడు లోకములు నేలునమ్మా-జోకతో తెలియనమ్మా యెప్పటికి మోసపోకుండరమ్మ ॥లా॥ ఆనాడె రక్షకుండూ అన్నిటిలో నిండి యున్నాడె కొమ్మ-దీనులను బ్రోచునమ్మా మనసందు యెప్పటికి మరువకమ్మా ॥లా॥ పుట్టడని తెలియరమ్మా నిజగురుడు గిట్టు టుల్లక్కి యమ్మా-పట్టుదల వదలకమ్మా యిక నీవు గట్టిగా తెలుసుకొమ్మా ॥లా॥ యీధరలోపలాను శివరామదా సిటుల నుతియించెను-రామచంద్రుని కరుణతో పల్కె నిక కాపాడి రక్షించుమిం ॥లా॥

గద్య॥ ఇతి శ్రీమద్వేదాంతసారుండును సచ్చిదానందతీతుండును క్షేత్రక్షేత్రజ్ఞ రహితుండును క్షరాక్షరోపాది విలక్షణుండును ప్రకృతి పురుషద్వయ దోష రహితుండును పరమపవిత్రుండును అశరీరుండును అప్రమేయుండును అచలుండును నయిన శ్రీమత్ అన్నమరాజవంశ భరద్వాజగోత్ర పవిత్రుండు నగు సుగుణాకరస్వామి దేశికేంద్ర నిజగురుచరణ కమలారవిందారవింద మరందపానతుందిలతా మందమందానంద మిళిందబృందంబున శ్రీమదార్వేలనియోగి రంగరావుశర్మ వంశోద్భవ కౌండిన్యసగోత్ర పవిత్రుం డగు వుప్పలధడ శివరామదాసు ప్రణీతంబైన సర్వార్థ నిర్గుణమానసపూజ గురుకీర్తనలు హరిభజనకీర్తనలు సర్వము సంపూర్ణము

శ్రీ అచలగురుచరణారవిందార్పణమస్తు

# ద్విపద సాంఖ్యతత్త్వము - ప్రథమ భాగము

## ప్రపంచ ఉత్పత్తి లక్షణము

శ్రీగురు పాదముల్ చిత్తంబులోన బాగుగా దలచియు ప్రస్తుతించియును ॥౧॥ పాదుగా గురువాక్య పద్ధతియు బూని వేదాంతమార్గంబు వెదకి శోధించి ॥౨॥ అనుభవవేద్యముగ ఆత్మ శోధించి పన్నుగా అంతయును పల్కితిని వినుడీ ॥౩॥ ఆది కాలము నందు అదియేమిలేక అంతట నిండియు అచలమై వుండి ॥౪॥ అందులోపల వ్యంద్యసూనుని పగిది అంతకు తనకు తా ఆత్మయును బుట్టె ॥౫॥ ఆయాత్మలోపల ఆదిశక్తపుడు చంద్రచంద్రికవలె చెన్నొందె కల్గె ॥౬॥ రంగైన మాయందు రాజితముగాను పొంగుగా త్రిగుణములు పొసగంగ గల్గె ॥౭॥ ఆకాశమును వాయు అగ్ని జల భూమి ప్రాకటంబుగ పంచభూతములు గల్గె ॥౮॥ అండ పిండాండ బ్రహ్మాండంబు లాయె మెండుగా దశదిశలు నిండె నామాయ ॥౯॥ అయిదుభూతంబులు అవి భిన్నమయ్యె అయిదు అయిదులు యిరువదైదయ్యె వెలసె ॥౧౦॥

## పంచవింశతి విభాగము

అవి విన్నవించెదను ఆలకించండి యువిద లందరు భక్తియుక్తి మతిచేత ॥౧౧॥ ఆకాశ మాకాశ మది జ్ఞాన మాయె మక్కువ సగమును మరి భూతములతో ॥౧౨॥ ఆకాశమును వాయు మరి మనసాయె ఆకాశమును అగ్ని బుద్ధయ్యె వెలసె ॥౧౩॥ ఆకాశ మును జలము ఆదియు చిత్తంబు ఆకాశ భూమితో హంకార మాయె ॥౧౪॥ ఖ్యాతిగా గగనంబు కల్గె నీఅయిదు అంతరేంద్రియము లని చెప్పబడును ॥౧౫॥ వాయువులో సగము వ్యానుండు నాయె పాయ కర్థము నాల్గుభూతముల గూడి ॥౧౬॥ వాయు గగనము గలసి వరసమానుండు వాయు వగ్నిలో గలసి వరవుదా నుండు ॥౧౭॥

వాయు జలమును గలసి ప్రాణుండు ఆయె ధర గలసి పానుండు తగ గల్గె నమ్మా ॥౧౮॥ యెంచగా గాలిచే జన్మించినట్టి పంచప్రాణం బుల పద్ధతియు యిదియు ॥౧౯॥ అగ్నిలో సగమియ్యా అది కన్ను ఆమె మిగిలిన నర్ధము భూతము లన్ని గలసి ॥౨౦॥ అగ్ని గగనము గలసి కలిగె చెవులమ్మ అగ్ని వాయువు గలసి నాయె చర్మంబు ॥౨౧॥ అగ్ని అప్పుతో గలసి నాయె నాలుకయు అగ్ని ధర గలసియు నాయె నాశికము ॥౨౨॥ జ్ఞానేంద్రియంబులు కల్గె అగ్నియందు అనువుగా వివరించి తడి అంత మీాకు ॥౨౩॥ జలము జలముతో గలసి చెలగె రస మయ్యె నాల్గుభూతములూ నమరియూ సగము ॥౨౪॥ జలము గగనము గలసి కలిగె శబ్దంబు జలము వాయువు గలసి కలిగె సర్శయును ॥౨౫॥ జల మగ్నితో గలసి కల్గె రూపంబు జలము భూమితో గలసి నాయె గంధంబు ॥౨౬॥ జలభూతమున వేగ తన్మాత్రలాయె ఆలసటలేకను అది వింటి రికను ॥౨౭॥ పృథివి అర్ధంబై గుదము జన్మించె అర్ధంబు భూతము లన్ని టియు గలసి ॥౨౮॥ పాయు ఆకాసముతో పరగ వాక్కాయె పాయు వాయువుతో గలసి వర కరం బాయె ॥౨౯॥ పాయు అగ్నితో గలసి పుట్టె పాదములు పాయు జలముతో గలసి నాయె గుహ్యాంబు ॥౩౦॥ భూఅంశమున నైన భావంబు యిదియు పాయక కర్మేంద్రియంబు లన్నియును ॥౩౧॥ యివి యింద్రియం బులు యింక దెల్పెదను ప్రవిమలవిషయముల్ పరగ వీటికిని ॥౩౨॥ ఆది దేవతల నెల్ల నదియు వివరింతు మతిగల్గి వినుకీకా మగువ లంద రును ॥౩౩॥

## పంచవింశతి తత్వ విషయములుఅధి-దేవతలు

జ్ఞాతకు యెరుకయు మరుపె విషయంబు ప్రత్యగాత్ముడు వేగ పరగ నధిదూవి ॥౩౪॥ మనసుకు సంకల్ప మనెయె విషయంబు పని బూని చంద్రుడు పరగ దేవతయు ॥౩౫॥ బుద్ధికి విషయంబు భువి నిశ్చయంబు ఆది దేవతయు గురువు అయ్యెండు చెలియ ॥౩౬॥ చింతనే విషయంబు చిత్తంబునకును ఆది దేవతయు జీవు డమరియూ

రుండు ॥౩౭॥ అహంకారమునకు రుద్రు డభిమాని యగును
అహంభావం బనె నదియు విషయంబు ॥౩౮॥ వ్యానమునకు విజ
యుడు సమానమునకు జయుడు ప్రాణమునకు విశ్వసృష్టు పరగ దేవ
తయు ॥౩౯॥ వినుడు దానమునకు విశ్వయోనియును అనువుగా
పానమునకు ఆదిశ్వేకర్త ॥౪౦॥ చెవులకు విషయంబు శబ్దమై వుండు
దేవత దిక్పతి తేటముగ నుండు ॥౪౧॥ చర్మమునకు స్పర్శ చెప్పంగ
నేల ధర్మంబుగను వాయు దేవు డధిపతియు ॥౪౨॥ నేత్రంబులకు
రూపు నెలమి విషయంబు అగ్ని దేవతయు సూర్యు డయ్యెండు సఖియా
॥౪౩॥ రసమె జిహ్వాకు విషయుపతి వరుణు డవును - వాసగ
ముక్కుకు గంధమేను విషయంబు ॥౪౪॥ అశ్వినీదేవు అధిపతై
యుండు పశువులై చెడిపోక పాటించు డన్ని ॥౪౫॥ వాక్కుకు
విషయంబు వచనమై వుండు - అగ్ని దేవుడు అధిపతై వుండు ॥౪౬॥
కరమునకు దానమె కదు విషయ మగును దేవేంద్రు డధిపతి దేవుడై
యుండు ॥౪౭॥ నడచుటే విషయంబు నరయ పాదములకు ఆధి
దేవతై యుండు అరయ విష్ణుండు ॥౪౮॥ గుహ్యము కానంద
గుణమె విషయంబు బ్రహ్మ దేవతై బరువడిగ నుండు ॥౪౯॥
గుదమునకు విషయంబు మలవిసర్జనము మృత్యు అధిదేవతై ముద
మొంది వుండు ॥౫౦॥ యింద్రియములు విషయములు దేవతలును
ఆధ్యాత్మ ఆధిభూత అధిదైవికములు ॥౫౧॥ యింక తెల్పెద భూత
సంచితం బంత సంకోచ పడకను చౌరంగ వినుడీ ॥౫౧॥ పృథివి
భూతంబులో పుట్టినవి వినుడీ అస్థి చర్మము మాంసము నరములు
రోమములు ॥౫౨॥

## పంచభూతాంశ గుణములు

ఉదకభూతంబులో నుదయించె శుక్లము శోణితము మెదడు
శ్లేష్మము చెమట ॥౫౪॥ యింగిలములో నిద్ర సంగమము ఆకలి
దప్పి ఆలస్యమును కల్గె ॥౫౫॥ ఆకాశమున కామ క్రోధ లోభ
ములు శోక మద మోహము మత్సరము కల్గె ॥౫౬॥ వాయుభూత

ములో తీవ్రము గమనము లజ్జ చలనము భయము కల్గెను ||౫౭||
శబ్ద స్పర్శ రూప రస గంధము వుద్భవం బాయెను ఉర్వీలోపలను
||౫౮|| రస రూప స్పర్శ శబ్దములు నాల్గు పొసగ జలమందునా
పొందుగా నుండు ||౫౯|| రూప స్పర్శ శబ్దముల్ మూడు రూఢగ్ని
యందు ఒప్పుగా కలిగెను వరుసతో మూడు ||౬౦|| వాయువునందున
స్పరిశ శబ్దముల్ రెండు వాయు కానాశమున పరిగ శబ్దంబు ||౬౧||
రక్తవర్ణము పృథివి శ్వేతవర్ణము జలము యుక్తవర్ణము నల్పు వుం
డగ్నియందు ||౬౨|| వాయుభూతము ధూమ్రవర్ణమై యుండు
వాయక గగనంబు పరగ నీలంబు ||౬౩|| పృధ్వి లం బీజంబు పుట్టెను
వినుడీ వుదక వం బీజంబు వరుస జనియి చె ||౬౪|| అగ్నిలో రం
బీజ మమరియూ కల్గె ఆవాయు యం బీజమాయె చూడగను ||౬౫||
ఆకాశమున వేగ హం బీజ మాయె అమరి పంచాశక్తులు అందులో
వుండు ||౬౬|| పంచ మూర్తులు వేగ పరగ దేవతలు అంచితంబై
వున్న అంశములు యిన్ని ||౬౭||

## పంచప్రాణం-ప్రాణాదుల స్థాన కర్మ నిర్ణయం

పంచప్రాణంబుల పరగ స్థానంబు యెంచగా వుపవాయు
యెలమి వివరింతు ||౬౮|| ప్రాణవాయువు హృదయస్థానమం దుండి
నాణెపు శ్వాసముల్ నడుపుచూ నుండు ||౬౯|| అపానవాయువు
గుదస్థానమం దుండి - వుపవాయువులచే మలమూత్రముల విసర్జించు
||౭౦|| వ్యానవాయు సర్వాంగమందునను సమాన వాయువు నాభి
స్థానమం దుండీ ||౭౧|| ఆపాదమస్తకము వ్యాపించిన ప్రాపు నా
ళ్లన్నిటికి పంచన్నరసము ||౭౨|| కంఠమందు వుదాన మంటియుండి
యును కల గనుచు కలలోన కలువరం బొందు ||౭౩|| దగ్గు
తుమ్ములు రుచులు తగ బుట్టచేయు తగ అన్నరసము ఆత్మకు పంచి
పెట్టు ||౭౪|| నాగవాయువు రోమనాడులం దుండి వేగంబు లేక
శీతాదులను జేయు ||౭౫|| కూర్మవాయువు పాదమందు నివశించి
మర్మముగ శుష్క దేహము పుష్టి జేయు ||౭౬|| కనురెప్పలు నోరు

నిమ్మళంబుగను తిన్నగా మూయించి తెరపించుచుండు ॥౭౭॥ కృకరు
వాయువు నాసాగ్రమందుండి గమనంబు తుమ్మును తగ గల్గజేయు
॥౭౮॥ నేత్రగుహ్యామునందు నెలమితో దేవ దత్తుండు కూర్చున
పరుండ నిలచుండ ॥౭౯॥ జేయు వ్యక్తముగ ఘూర్ణాడించ
జేయు వాయక ధనుంజయువాయు నెప్పుడును ॥౮౦॥
సహస్రార మగు బ్రహ్మస్థానమందుండి శ్రవణరంధ్రముల చెలువంద
॥౮౧॥ అబ్ధిఘోషము భంగి ఆనాదములను అతివిచిత్రముగా అందు
పుట్టించు ॥౮౨॥ మరణకాలంబున మఘోష బాపు మరణించుతరి
తనువు సడలించి పోవు ॥౮౩॥ ధర నాళ్ళ వివరము తగను వినిపింతు
విశదముగ వినిపింతు వశమయిన దంత ॥౮౪॥ యెడమనాశికమును
యిడానాడియు నగును చంద్రనాడియు అగును శివు డధిపతి ॥౮౫॥
కుడినాశికము నాడి సూర్యనా డగును కడువేడ్కతో విష్ణు డధిపతై
య్యుంను ॥౮౬॥ మధ్యనాశికమున మరి సుషుమ్న మును ఆదిదేవతయు
బ్రహ్మ అగ్నినాళమును ॥౮౭॥ కుడినేత్రమునను గాంధారినా డుండు
కడు యింద్రు డధిపతై కడువడిగ నుండు ॥౮౮॥ వర హస్తినీనాడి
కడుజిహ్వాయందు వరుణు దధిపతి వామనేత్రమందుండు ॥౮౯॥
దక్షిణకర్ణమున తగ పూషనాడి సాక్షి దగ్దేవతాదైవమై వుండు ॥౯౦॥
వామకర్ణమున వర పయశ్వని యమరియుండును బ్రహ్మ అధిపతై
నచట ॥౯౧॥ అలంబసనాడి అది శిశ్నమందు అగ్నిదేవుడు దైవ
మవును దాసికిసి ॥౯౨॥ పాయువందున కుహూనాడి స్థానంబు పాయక
ఆదిదేవతయు పరగ భూమియును ॥౯౩॥ శంఖినినాడికి చంద్రు
డధిపతియు శంక లేకను నాభిస్థానమందుండు ॥౯౪॥ అంత రేంద్రియ
స్థానములను తెల్పెదను మంతనంబుతో ఓపి మరి వేగ వినుడి ॥౯౫॥
జ్ఞాత చక్షువులందు ఘనముగా వుండు బుద్ధికి స్థానంబు భువిలోన
ముఖము ॥౯౬॥ మనసుకు స్థానంబు మరియు కంఠంబు మానుగా
హంకారి మరిహృదయమునను ॥౯౭॥ చిత్తంబునకు స్థాన ముత్తముగ
వినుడీ నెత్తముగ నాభి సంస్థాన మనబడును ॥౯౮॥ పంచాగ్నిస్థాన
ములు పరగంగ వినుడీ యెంచగా కాలాగ్ని పాదములయందు ॥౯౯॥

యముగా క్షుధాగ్ని నాభియం దుండు నయనముల కోపాగ్ని మరి
యందుండు ॥౧౦౦॥ ఆత్మయం దుండును నమరి జ్ఞానాగ్ని శీతాగ్ని
హృదయమున చెలువొంది వుండు ॥౧౦౧॥

గద్య॥ అన్నమతాజ వంశోద్భవుండు వెలివేర్తి సుగుణాకరస్వాముల ప్రియ
శిష్యుండు నగు రంగరావుశర్మ వంశ కౌండీన్యసగోత్రపవిత్రుండు
నగు కరణం తిమ్మప్ప ప్రథమపుత్రుండు నైన శివరామదాసుచే
రచించబడిన ద్విపద వ్యాఖ్యము సాంఖ్యతత్వము
ప్రథమభాగము సంపూర్ణము

శ్రీపరబ్రహ్మణేనమః

# ద్విపదవ్యాఖ్యము - ద్వితీయభాగము

## ఘ ట శో ధ న ము

షడచక్రముల జాడ చెారంగ వినుడీ షటుపదవులును గనియె సర్వజ్ఞులయితె ||౧|| ఆసనాస్థానంబు ఆధార ముండు - అందు నాలుగు రేకు లమరియూ వుండు ||౨|| నాల్గురేకులయందు నమరి వ-స-శ-ష లు నాలు గక్షరములు నక్షత్రకృతియు ||౩|| యెలమి సద్యోజాతముఖమందు నైన వెలయు భూతత్వంబు వేడ్కతో నుండు ||౪|| య - ను భీజంబున క్రియాశక్తి పాయక హంసలు పరగ నార్యాణ్ణ ||౫|| యిదియు భూలోకంబు యిచట గణపతియు యిచట సాయుజ్యంబు యిరుపంది వుండు ||౬|| ఆధారమునకు రెండు అంగులముల పైన స్వాదిష్టచక్రమును ఆరుదలములతో ||౭|| లింగస్థలంబందు రంగుగా నుండు అంగుగా బ-భ-మ-య-ర-ల-వ ను నక్షరములు ||౮|| వామదేవఖంబు వరజలం బుండు వ-య ను భీజంబు దగ నిచ్ఛాశక్తి ||౯|| యిది భువర్లోకంబు యిచట బ్రహ్మాయును యితనికి నార్వేలు అజప మగుచుండు ||౧౦|| సాన్నిధ్యపదవిదీ చదరక నుండీ సరగున మణిపూరకచక్ర మెట్లనిన ||౧౧|| నాభిస్థానంబున నమరి దశదళమునా డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ యక్షరములు ||౧౨|| అఘోరముఖమునా అవతరించున్న అగ్నిభూతంబందు ఆట జ్ఞానశక్తి ||౧౩|| అధిపతీ విష్ణువు అది సువర్లోక అదియె సారూప్యంబు అతడు రక్షకుడు ||౧౪|| రం-బీజమును వుండు రంభ నచట వుండు - షట్సహస్రంబుల జప మర్పణంబు ||౧౫|| అనహతచక్రంబున లయహృదయమున పూనియు ద్వాదశదళములం దుండు ||౧౬|| క-ఖ-గ-ఘ-ఙ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ వుందును అకలంకముఖము తత్పురుషమందునను ||౧౭|| వాయుభూతంబును వా బీజముండు పాయకా ఆదిశక్తియం దచట నుండు ||౧౮|| మహార్లోకంబును మహాదేవు డుండు మహిమతో

సామీప్య మజప మార్గేలు ॥౧౯॥ కంఠస్థానంబునా కడు విశు ద్ధంబు అంటి పదఆరు దళ మమరంగ వుండు ॥౨౦॥ అ-ఆ-ఇ-ఈ ఉ-ఊ-ఋ-ౠ-ఌ-ౡ-ఎ-ఏ-ఐ-ఒ-ఓ-ఔ-అం-అః - యనునవియు ॥౨౧॥ యీశాన్యముఖమునం దాకాశమును య అనుబీజంబు నట పరాశక్తి ॥౨౨॥ జనలోకమును జీవు డధిపత్తై య్యుండు జయ ముగా సాక్షిత్వ పదవి అం దుండు ॥౨౩॥ హంకారమను బీజ మది వుండు నచట హంసలు ఒకవెయ్యి అర్పణం బగును ॥౨౪॥ రెండు దలములతోను నుండు భ్రూమధ్య దండిగాగ్నేయ చక్రం బందు నుండు ॥౨౫॥ హం-క్షం బులనియె రెండక్షరములను ఓంకార భీజంబు ఒనర శివశక్తి ॥౨౬॥ మహాగోప్యముఖమును మరి భూతములును మహాతపోలోకమును మరియాదతోను ॥౨౭॥ పరమాత్మ డుండును పాయక నందు పరగ హంసలు వెయ్యి పరగ నర్పితము ॥౨౮॥ సహా స్రారచక్రంబు సరవితోడుతను సాహస్రదళములు స్థానంబు వేగ ॥౨౯॥ బ్రహ్మరంధ్రమునందు పరగంగ వినుడీ బ్రహ్మస్వరూపంబు బాధలేకుండు ॥౩౦॥ పంచరంగులతోడ పంచముఖములచే పంచభూతంబులును పంచాక్షరములు ॥౩౧॥ పంచకర్తలు వేగ పంచశక్తులును పంచాకృతులతోడ పరగ నున్నట్టి ॥౩౨॥ సగుణ నిర్గుణమైన సాక్షిరూపునకు సరసముగ సాహస్ర హంస లర్పితము ॥౩౩॥ సత్యలోకం బండ్రు వుత్తమోత్తములు వుత్తమపద విదియె వుచిత మొప్పగను ॥౩౪॥ అతలలోకంబును అరికాళ్ళయందు వితలలోకమును మీగాళ్ళయందు ॥౩౫॥ మక్కువ మడిమలో మరి సుతల ముండు పిక్కలయందున తలాతలలోక ముం డును ॥౩౬॥ మొకాళ్ళయందున మొగి రసాతలం తొడలయందు మహాతలలోక ముండు ॥౩౭॥ పాతాళలోకంబు పాయువం దుండు- సప్తద్వీపంబుల స్తానములు వినుడీ ॥౩౮॥ తలయందు జంబూద్వీపము తాయుండు వెలయ వెముకలయందు ప్లక్షుద్వీపంబు ॥౩౯॥ శిఖ యందు యుండును శాఖద్వీపంబు చర్మమందున శాల్మలీద్వీప ముండు ॥౪౦॥ నఖమందున పుష్కద్వీప ముండు యిక మాంసమున కుశ

ద్వీప మొప్పగను ॥౪౧॥ క్రౌంచద్వీపంబును మించి వెంట్రుకలలో యొంచగా నుండును యేమందు అన్ని ॥౪౨॥ సప్తసముద్రముల స్థాన మివరింతు సంపూర్తిగ వినుడి సంపూర్ణభక్తులును ॥౪౩॥ పుష్పాసముద్రము ఒప్పు మూత్రంబు మెప్పుగా ఇక్షునది మరి చమట యును ॥౪౪॥ సురసముద్రము శుక్ల మింద్రియము సర్పిసముద్రము సతిపతుల ద్రవము ॥౪౫॥ దధిసముద్రంబును అది శ్లేష్మ మగును క్షితి-క్షీరసముద్రము నోటి జొల్లను ॥౪౬॥ శిద్ధోదకము నదీ సుద్ది జెప్పెదను నిద్ర కన్నీరు కాశిద్ధమ య్యుండు ॥౪౭॥ అష్టదిక్పాలకుల ఆధార మినుడీ యిష్టము తోడుత యింగితంబుగను ॥౪౮॥ యింద్రుని నగరంబు యిలలో భ్రూమధ్యమందు అగ్నిహోత్రుని పురము మక్షి యందు ॥౪౯॥ దక్షిణకర్ణమున అంతకునిపురము తగ పార్శ్వమున నైరుతి దేవతుండు ॥౫౦॥ పరగ పృష్ఠమునందు వరుణపురము - పవన నగరంబు దా పార్శ్వమం దుండు ॥౫౧॥ వామకర్ణంబున వర కుబేరుండు వామనేత్రంబున హరుడు డెగిరియు ॥౫౨॥ దశ నాదముల వేరు ఏశద మెరిగింతు పొసగ మ్రోయును వేగ జలధి ఘోషంబు ॥౫౩॥ భేరినాదము ఘంటా వేణునాదం భ్రమరనాదము మృదంగనాదం వినులనాదంబు ॥౫౪॥ కాహళి మద్దెల మేఘనాద ములును కింకిణినాదం ఓంకారనాదంబు ॥౫౫॥

## పంచముద్రల లక్షణం

పంచముద్రల లక్షణం బేర్పరింతు సంచితాదులు నెల్ల సమసి పోనగును ॥౫౬॥ పద్మాసనస్థుడై పదిలముగ నుండి పరగ అర్ధోన్మీలిత లోచనంబును ॥౫౭॥ లోచూపు నిల్పియు తోపుట జూచి తొమ్మిదిద్వారముల తొలగి చిత్తంబు ॥౫౮॥ నిమ్మళం బుగ నిల్పి సకలేంద్రియములు సమ్మతంబుగ విషయ - సౌఖ్యముల నిల్పి ॥౫౯॥ కుండలిశక్తిని కుదుర మేల్కొలిపి దండిగ ప్రాణము తగ నిరోధించి ॥౬౦॥ తాలుమధ్యంబున జిహ్వాలగ్నంబు మేలుగ గావించిబహిరంతరములు॥౬౧॥ యెందు పూర్వాధోభాగములయందు

పొంది భావాభావముల సమము నుంచి ॥౬౨॥ దంతముల చేతన
దంత మంటకను మంతనంబును పూర్ధ్వముఖము గావించి ॥౬౩॥
వృత్తిరహితము చేయ వుచితమయినట్టి యుదియు కేచరీముద్ర య
చెప్పబడెను. ॥౬౪॥ కన్నులు రెండు కదలింపను పన్నుగా కొ
ముక్కునందునను నిల్పి ॥౬౫॥ నిల్పి చూచుట వేగ నిది భూచ
రియు వెలుపల సగమును వేగ రెప్పలును ॥౬౬॥ సగము చూపు
నుర్ధ్వసరళమునందుంచి సరిగ చూచుట మధ్యలక్ష్యమై యుండు ॥౬౭॥
నేత్రములు రెండును శ్రోత్రములు రెండు నాశికారంధ్రములు నవ
రంగ మూసి ॥౬౮॥ భ్రూమధ్యంబున చూపు బుద్ధితో నిల్పి
ప్రేమతో బిందునాదము కల లన్ని ॥౬౯॥ దర్శించుటయు మనసు
తగ నుంచి అందు తగను జూచుట వేగ తగకు షణ్ముఖముద్రయు
॥౭౦॥ వసర శాంభవిముద్ర వసుధలో మూడువిధముల జూచుట
నదియు శాంభవీముద్ర ॥౭౧॥ నేత్రములను తెరచి నెలమితో
మనసు వృత్తు లన్నియు నిల్పి వస్తువందునను ॥౭౨॥ నిల్పుట వెలి
చూపు నిదియు ప్రథమంబు సల్ప బహిర్లక్ష్యభావమై వుండు ॥౭౩॥
మనసు వృత్తు లన్నియు మరలించి నిల్పి అనిశము నేత్రముల తెరచి
భ్రూమధ్యమందు ॥౭౪॥ లక్ష్యము నుంచి చూడ చూడ అంద
మగు మధ్యలక్ష్యం బందు రిదియు ॥౭౫॥ చతుర్వింశతితత్వము
లను జయ మొంది శబ్దగుణకం బాత్మ చెలగి దృష్టియును ॥౭౬॥
ఆకాశమందున అమరంగ వదలి ప్రాకటంబుగ మనసు అభిముఖము
జేసి ॥౭౭॥ భ్రూమధ్యమునను అంతర్లక్ష్యము వుంచి నేమముతో
చూడ నెలమి వింతలును ॥౭౮॥ ద్రష్ట యొందున లక్ష్యమును
తగను వుంచి—యిష్టముతో జూడ నిదియు శాంభవియు ॥౭౯॥
యిది రాజయోగముకు యిదియు ముఖ్యంబు యిదియు శ్రేష్ఠం
బంచు అందురు బుధులు ॥౮౦॥

## పంచభూత తత్వము

జ్ఞానసమానము లీ వీనుల శబ్దమును గ్రహించియు నోట
ముచ్చట వచించు ॥౮౧॥ ఆకాశపంచకా మందు దివ్యాయును

ఆత్మవేత్తలు యొప్పుచు అనుభవముతోను ||౮౨|| జ్ఞాత మనసును
బొంది వ్యానమును గూడి ప్రీతిచే చర్మమున స్పర్శించి తాను ||౮౩||
చేతితో దానకర్మయు జేయుచుండు భాతితో వాయుపంచక మయ్యి
యుండు ||౮౪|| జ్ఞాతబుద్ధిని జేరు దానమును గూడి నేత్రములచే
సర్వరూపముల నెరిగి ||౮౫|| పాదములతో నడచి పరుగెత్తుచుండు
పావక పంచకంబై యుండు యిదియు ||౮౬|| జ్ఞాతచిత్తమును
ప్రాణమును గూడుకొని జ్ఞానము జిహ్వచే షడ్రసము లన్ని ||౮౭||
గరిమతోడుత రుచులు గ్రాహ్యంబు జేసి గుహ్యముతోడ ఆనందించు
చుండు ||౮౮|| జలభూతపంచకము జనుముతో నగును యిల
పంచకంబును యిటుగా తెలియుండి ||౮౯|| జ్ఞాత హంకార
మపాన ఘ్రాణమున గంధంబు గొని గుదముతో విసర్జించు ||౯౦||
చతురదేహావస్థ చతురజీవులును చతురభిమానములు చెంగి కోశ
ములు ||౯౧|| యిరువదైదును గూడి స్థూలతను వాయె అరుదుగా
అన్నమయకోశ మనబడును ||౯౨|| యిదె జగత్కార్యము లన్ని
టిని జర్పు యిదే మానుషత్వము యితడు విశ్వుండు ||౯౩|| యిత
నికీ అభిమాని యిల విరాట్టుండు గతి జాగ్రతయు నేత్రస్థానమై
వుండు ||౯౪|| పదియేడు తత్వములు పరగ సూక్ష్మంబు యిదియె
దేవత్వము యితడు తైజసుడు ||౯౫|| ఇతనికి పతియు హిరణ్య
గర్భుండు యితడు కంఠస్తానమున స్వప్నమొద్దు ||౯౬|| ప్రాణ
మయకోశంబు జ్ఞానకోశంబు పరగ రెండును సూక్ష్మదేహాంశ
మయ్యె ||౯౭|| కారణదేహంబు క్రమముగా వినిపింతూ కాని
కార్యము లన్ని కడకొత్తి వినుడీ ||౯౮|| చిత్తంబు ప్రాణంబు జీవే
శ్వరులును మత్త నొందియు హృదయమార్గమం దుండి ||౯౯||
కూడి సుషుప్తితో లీన మొందియును వేడ్కతో ప్రాజ్ఞుడు విభుడవ
య్యుండు ||౧౦౦|| ఆనందమయకోశ మిదె కారణంబు అనువుగా
మహాకారణం బేర్పరింతు ||౧౦౧|| స్వచ్ఛమై యున్నట్టి స్వప్రకా
శంబు మచ్చిక జ్యోతియె మహాకారణంబు ||౧౦౨|| యిదె తుర్య
మనబడూ యితడు సర్వజ్ఞపతియు స్వరాట్టయ్యి పరగ నున్నాడు

॥౧౦౩॥ మనసును కర్మేంద్రియంబులు కూడి విను మనోకోశంబు వివర మిదియేను ॥౧౦౪॥ ఓంకారమును వేగ ఒనరంగ వినుడీ ఆకారమును బ్రహ్మ మచట నాదంబు ॥౧౦౫॥ ఉకారమును విష్ణు వుండు బిందువును మకారమును రుద్రుడును కళానను ॥౧౦౬॥ భూతలమును వేగ భువి జలం బందు - ఖ్యాతిగా జల మగ్నిలో నైక్య మగును ॥౧౦౭॥ ఆఅగ్ని వాయువులో నం దణిగియుండు ఆవా యువు గగనమందగును మిశ్రంబు ॥౧౦౮॥ ఆకాశమును మాయయందు అణిగియుండు ఆమాయ ఆత్మలో అణిగియు లయించు ॥౧౦౯॥ ఆత్మ అచలంబయ్యె అంతట నిండి ఆకారమును లేని అచ్యుతం బగును ॥౧౧౦॥

గద్య ॥ అన్నమరాజవంశోద్భవుండు వెలివేర్తి సుగుణాకరస్వాముల
ప్రియశిష్యుండునగు రంగారావు వంశకౌండిన్యసగోత్ర పవి
త్రుండు కరణంతిమ్మప్ప ప్రథమపుత్రుండు నైన
శివరామదాసుగారిచే ప్రణీతం బైన ద్విపద
వ్యాఖ్యము ద్వితీయభాగం ఘటశోధనం
సంపూర్ణం

శ్రీగురవే నమః

# శ్రీనివాస పద్యములు - ప్రథమభాగము

1 శ్రీపతీ గురురాఘవా నీపయిన చిత్తంబు నిలిపినాడా
నాపైన దయవుంచియు నన్నేలు నాతండ్రి శ్రీనివాస.

2 ఆలుపిల్లలు యనుచునూ మమకార మాయలో జిక్కినాడ
కల్లసంసారమును దాటించ ఘనుడవే శ్రీనివాస.

3 కలిమిలేములు స్థిరమని నిను మరచి కాలుని వలజిక్కితి
అలువేలుమంగ రమణా నన్నాదరించవే శ్రీనివాస.

4 యెన్నిజేసినను గాని నిను జేరకున్ననూ సుఖము లేదు
చిన్నె లన్నియు బాపియూ నన్ను నీదరి జేర్చు శ్రీనివాస.

5 చింత లన్నియు బాపవే నీ చెంత చేరియున్నాను దేవ
పంతంబు యేల నాపై పతితపావనుడ శ్రీనివాస

6 చిక్కులా పెట్టకయ్యా నన్నేలు నన్నెడబాయక
అక్కరతో బ్రోవుమయ్యా నను నీవు మక్కువతో శ్రీనివాస.

7 నీలమేఘశ్యాముడ నీసాటి యిలలోన యెవరు లేరు
పాలించి బ్రోవుమయ్యా నీపాల బడితిని శ్రీనివాస.

8 యెప్పటికయినగాని నిను జేరకున్ననూ సుఖము లేదు
తప్పుఒప్పులు యెంచక యిప్పుడే నను బ్రోవు శ్రీనివాస.

9 ఆలకించియు బ్రోవవే నాపలుకు లాలించి బ్రోవుమయ్యా
నీలీల వర్ణించనూ తరమా ని యిలలోన శ్రీనివాస.

10 బూటకపు బొమ్మలాట ఆడించ వేడుకాయెన నీకును
నాటకుడ నీ వంచు నిను మరువలేనయ్యా శ్రీనివాస.

11 యెన్నిబాధలు పెట్టినా నను నీవు యెన్నిసుఖములు పెట్టినా
అన్నియూ నీవు గావ ఆనందప్రభుడవే శ్రీనివాస.

12 సన్నుతించెద నీకును యిలలోన సరియెవరు నీకు యనుచు
మన్నించి కడతేర్పను మాణిక్యరూపుడవె శ్రీనివాస.

13 దాసానదాసు డనుచు నిను నేను కోసిలొగ్గియు వేడితి
యీాపణంబుల బాపను వైద్యుడవు రఘురామ శ్రీనివాస.
14 నిరుపేదకుడను నేను దొరికితివి నీ పాదములు విడువను
కరుణతో మమ్మేలవే కోదండరాముడవె శ్రీనివాస.
15 మరణకాలమునందున నిన్ను నే తలతునో తలువలేనో
స్మరణకలుగా జేసియు నన్నేలు గోవింద శ్రీనివాస.
16 మాధవా నీ నామము యెప్పటికి మరచుటకు మరుపురాదు
దామోదరా శ్రీధరా దయజూచి నన్నేలు శ్రీనివాస.
17 యెన్నియాత్రలు దిరిగినా నదులలో స్నానంబు లొనరించినా
నిన్ను గానకవుందురు శ్రీలక్ష్మిప్రాణేశ శ్రీనివాస.
18 దేవదు లందరికినీ శ్రీరామ దేవుడవె యయ్యినావు
నీమహిమ తెలియలేక యిలలోన వెతుకుదురు శ్రీనివాస.
19 నన్ను మరతూ వేమని నా మనసు చాల తపియించుచుండె
నీకన్న నా కెవ్వరు పృథివిలో వున్నారు శ్రీనివాస.
20 యెన్నిజన్మము లాయెనో నేటి కెందు జన్మించినానో
నన్ను దరిజేర్చవయ్య యిఘునయిన నాతండ్రి శ్రీనివాస.
21 చిక్కచీకటి లోపలా గురుదేవ చిక్కియున్నా వాడను
దక్కించి బ్రోవ నీవు ఆనందప్రభుడవే శ్రీనివాస.
22 యేపాప మెరుగనట్టి వాడనూ కాపాడ వేగ రావ
ఆపదల బాపవయ్య నా తండ్రి రఘురామ శ్రీనివాస.
23 నీకంటె నా కెవ్వరు యిలలోన దిక్కెవ్వ రున్నరయ్య
వుంటె తెలుపా వేమయా శ్రీలక్ష్మిప్రాణేశ శ్రీనివాస.
24 మొదలేమి లేనివాడ గురుదేవ ముదముతో కలుగజేసి
పదిలపరచక పోదురా కోదండరాముడవె శ్రీనివాస.
25 పాతకుడ నే నంచునూ నాతోను పలుకుటకు మనసురాద
యేపాపముల యెరుగను నాతండ్రి లోకేశ శ్రీనివాస.
26 మాతపిత్రాదులాను మరి బాంధవుల యెంత నమ్మివున్న
నూతిలో బడినవాని చందంబు ఆయనూ శ్రీనివాస.

27 నీవు నేనా యనుచునూ నను నీవు వేరు జేయుట ధర్మమూ నే
నీవు ఒకటి యనుచూ నీకునూ తెలియదా శ్రీనివాస.

28 యిట్టిస ధిని తెలసియూ న న్నింత కష్టపెట్టుట ధర్మమా
పట్టుదల యేలనయ్యా వేగమే నను బ్రోవు శ్రీనివాస.

29 అయ్యా నీముద్దుముఖము యెన్నడూ చూడగల్గునో కల్గదో
శ్రీధర వేగ వచ్చి దయజూచి నన్నేలు శ్రీనివాస.

30 చిత్త మొకతట్టు జేర్చి న న్నింత శ్రమలు జెందించబోకు
చిక్కు లన్నియు బాపిచు నాతండ్రి నన్నేలు శ్రీనివాస.

31 ఆధారకమలముననూ గణపతివి అయ్యుండి నిలచి నీవు
ఆరునూరుల హంసలూ అజపంబు అవునుగద శ్రీనివాస.

32 స్వాధిష్ట కమలమందు బ్రహ్మవై ప్రబలితీవయ్యా నీవు
ఆరువేలా హంసలూ అజపంబు అవునుగద శ్రీనివాస.

33 మణీపూరకా మందున విష్ణువై రక్షకుం డనుచు నీకు
ఆరువేలా హంసలూ అజపంబు అవునుగద శ్రీనివాస.

34 హనహతా చక్రమందు రుద్రుడై నిలచితీవయ్యా నీవు
అక్కడా ఆరువేలూ అజపంబు అవునుగద శ్రీనివాస.

35 విశుద్ధకమలమునకు జీవుడనె పేరుతో ప్రబలితీవి
వెయ్యిహంసల కాలమూ అజపంబు అవునుగద శ్రీనివాస.

36 ఆగ్నేయ కమలమందు పరమాత్మ రూపమై నిలచితీవి
వెయ్యిహంసలు నీకును అజపంబు అవునుగద శ్రీనివాస.

37 సహస్ర కమలమునను శ్రీరామ గురురూప మయితివయ్యా
వెయ్యిహంసల కాలము అజపంబు అవునుగద శ్రీనివాస.

38 హంస రూపముతోడను నన్నింత ఆట లాడంగజేసి
మోసంబు జేయ నీకు నాతండ్రి న్యాయమా శ్రీనివాస.

39 యిడపింగళ మధ్యన నీటుగా నిలచియు పలుకవేమి
జోడు బాయక యెప్పుడు యిటుజేయ న్యాయమా శ్రీనివాస.

40 యేకచక్రాధిపతివై గురుదేవ లోకమును పాలించుచు
చీకాకు జెందించక శ్రీరామ కాపాడు శ్రీనివాస.

41 యేరీతి వర్ణితునూ గురుదేవ యేరూప మని తలచెదా
అన్నిరూపులు నీవెయై ఆనంద ప్రభుడవే శ్రీనివాస.

42 దేవాదులైన గాని గురుదేవ నిన్ను వర్ణింపలేరు
నన్ను మన్నించ నీవు నాథుడవు జయరామ శ్రీనివాస.

43 ఒక్క తేలివాడను చిక్కులో చిక్కి వున్నాను నేను
మక్కువతో వచ్చి నీవు రక్షించు గోవింద శ్రీనివాస.

44 నా ప్రాణనాథు డనుచు నిను నేను దోసి లొగ్గుచు వేడితి
గోపాలబాల రావె నను నీవు కాపాడ శ్రీనివాస.

45 పంచభూతములు గావు గురుదేవ పంచకోశములు గావు
యెంచగా యిరువదయిదు తత్వములు మరిగావు శ్రీనివాస.

46 స్థూలంబు నీవు గావు మరియును సూక్ష్మంబు నీవు గావు
కారణము నీవు గావు మహాకారణము గావు శ్రీనివాస

47 అండములో నీ వైతివి గురుదేవ పిండములో నీ వయితివి
బ్రహ్మాండ మంత నీవై ప్రబలితివి పరమాత్మ శ్రీనివాస.

48 అన్నియూ నీ వయితివి సద్గురు అన్నియూ నీవు గావు
అన్నిటిని నంటబోవు సచ్చిదానందుడవె శ్రీనివాస.

49 సగుణమూ నీ వయితివి గురుదేవ నిర్గుణము నీ వయితివి
సగుణ నిర్గుణములాకూ సాక్షివీ నీవె కది శ్రీనివాస.

50 అట్టి శుద్ధబ్రహ్మవై నుండగా అందులో నొక ఆత్మయు
వంధ్యసూనుని పగిదిగా తనకు తా కల్గెనూ శ్రీనివాస.

51 ఆయాత్మయందు మరియు ఆదిశక్తి ఒకటి జనియించెను
అట్టి మహాశక్తిలోన త్రిగుణంబు లాయనూ శ్రీనివాస.

52 ఆత్రిగుణములోపలా అందులో ఆయె నం దొకటి బ్రహ్మ
మాయప్రపంచంబును సృష్టించ నాయెనూ శ్రీనివాస.

53 మరిఒకటి విష్ణు వయ్యె పోషించ మాయజగంబు నంత
గరిమ శివు డొక డయ్యెనూ జగమునూ హరియించ శ్రీనివాస.

54 ఆమూడుగుణములందు పంచభూతములు నం దొకటి ఒకటి
వేమారుకూడ యివై అయిదగుచు వెలసెనే శ్రీనివాస.

55 అదిస్థూలదేహ మయ్యె అందులో పదియేను సూక్ష్మ మయ్యె
మరియునూ రెండు గలపి కారణము ఆయనూ శ్రీనివాస.

56 యేడేను పదునాలుగు లోకముల ఏకచక్రాధిపతివై
వాడవాడలయందున యెడతెగక వుందువట శ్రీనివాస.

57 అందుయిం దనగరాక అంతటా నూదిమొన సందులేక
మందమతులకు అందక నాతంండ్రి ప్రబలితివి శ్రీనివాస.

58 దశా అవతారు లనియు మరియును పశము గాదంచు తెలియ
అసమాన తేజు డంచు యిలలోన కనలేరు శ్రీసివాస.

59 ఒక్కడని కానకాను జను లంత చిక్కులో చిక్కి రంత
నిక్కముగ యెదట నున్న బ్రహ్మమును కనలేరు శ్రీనివాస.

60 యెంతటీ అజ్ఞానము జనులకూ యెరిగింప యెవరి వశము
అంత ఇం తనగరాక అమలము యెరుగుటకు శ్రీనివాస.

61 మాయలో చిక్కుపడియు శ్రీరామ ప్రాయ మెల్లను పోయెను
యేసాధనముచేతను నిన్ను మరి యెరిగేరు శ్రీనివాస.

62 అష్టాంగ యోగములచే నిను గనుట వశముగానీ వాడవు
నిష్టనీమములవల్ల నిను దెలియ లేరయ్య శ్రీనివాస.

63 జపతపాదులచేతను మిము జేర తరము గాదయ్య నాకు
అపరాధముల బాపి కృపతోను కాపాడు శ్రీనివాస.

64 యజ్ఞ యాగములు జేసినా దేవతా అర్చనాదులు సలిపినా
ప్రాజ్ఞులకు అందబోవు గోవింద పరమాత్మ శ్రీనివాస.

65 మేటియా శ్రీ రామదాసు పీఠమున సుగుణాకరాస్వామిగురులు
మాట లేనట్టి అచలా మార్గ మిది మరువకనె శ్రీనివాస.

66 సుగుణాకరస్వాములా పాదముల నిరతంబు మ్రొక్కువాడ
దాసులకు దాసుడానై శివరామ దాసుడను శ్రీనివాస.

67 యిలను వుప్పలధడనె పురములో బ్రాహ్మణా కులమందు నేను
రంగరాజు వంశమందు జననంబు నైతిగద శ్రీనిబాస.

68 నాతంండ్రీ తిమ్మప్పయు గురుదేవ నాతల్లి నరసమాంబ
పాదముల గొలుతు నెపుడు వారి పాదార్చకుడ శ్రీనివాస.

69 అందినది ఒకశతము చెప్పితిని వినిన చదివిన వ్రాసినా
అసమాన సుఖసాగరా కైవల్య మందెదరు శ్రీనివాస.

70 మంగళము సద్గురువరా నీకు జయమంగళము అచలమూర్తి
మంగళము నిర్వికార నీకు జయమంగళము శ్రీనివాస.

గద్య॥ అచలుండు నైన శ్రీమత్ సుగుణాకరస్వామి దేశికేంద్ర
నిజగురు చరణకమల కురువిందారువింద మరందపానతుందిల తా
మందమంచామిళింద బృందంబున శ్రీమదార్వేలనియోగి కౌండి
న్యసగోత్ర రంగరావుశర్మ వంశపయఃపారావారసుధా
కరుండగు వుప్పలధడ గ్రామము శివరామదాస
ప్రణీతంబయిన శ్రీనివాస శతకము ప్రథమభాగము
సంపూర్ణం

శ్రీ అచలగురు చరణారవిందార్పణమస్తు

శ్రీగురుపరబ్రహ్మణే నమః

# శ్రీనివాస గురుశిష్యానువాద తరంగం

## రెండవభాగం

1 శ్రీమత్సదానందునీ చిన్మయాతీతునీ మనసు నెపుడు
భావించి మ్రొక్కెదాను పరమాత్మ నాతండ్రీ శ్రీనివాస.

### శ్రీ త్రిమూర్త్యాత్మక గురుస్తవం

2 జగదేక సద్గురువులా శ్రీరామ జయదేవులా నెప్పుడు
శిరముగా మ్రొక్కువాడ నన్నాదరించవే శ్రీనివాస.
3 గురుదేశికేంద్రులాను మనసునా గురియందు నిల్పుకోని
పరమయోగుల కెల్లనూ మ్రొక్కెదా పరమాత్మ శ్రీనివాస.
4 శ్రీపతిపాదములను నే నెపుడు చిత్తమందున జేర్చియూ
పార్వతీయాశునకనూ నిరతంబు మ్రొక్కెదును శ్రీనివాస.
5 శ్రీభారతీశు నెపుడు చిత్తమున తలచుచూ నుండెదాను
పరమగురువుల కెల్లను మ్రొక్కుచూ నుండెదను శ్రీనివాస.

### పరమభాగవత స్తవం

6 వర వశిష్టాదులానూ వాల్మీక వ్యాసులా సనకసాది
సర్వబుధులక మ్రొక్కుదూ జయరామ లోకేశ శ్రీనివాస.
7 జనకాది యోగులకునూ జయశుకాచార్యులా కెల్లప్పుడు
అరయ సాందీప ఋషీ అచ్యుతుల అందరికి మ్రొక్కుదూను.
8 యుద్ధవా అర్జునులకూ ప్రహల్లాది నారదా భాగవతుల
జ్ఞాన వైరాజ్ఞులాకు అందరికి మ్రొక్కుదును శ్రీనివాస.

### అచల గురుపీఠ పరంపర

9 శ్రీధరస్వామిగురులా శివరామ దీక్షితుల మదిలో నెపుడు
తలచుచూ నుండెదాను మరువకను మనసునా శ్రీనివాస.

10 అప్పయ్యమంత్రి నెపుడు ఆత్మలో తలచుచూ నుండెదాను
కాపాడ వేగ రావె రఘురామ పరమాత్మ శ్రీనివాస.
11 శీతారామస్వామినీ శ్రీశేషమాంబనూ మదిలో నెప్పుడు
తలచుచూ నుండెదాను శ్రీలక్ష్మిప్రాణేశ శ్రీనివాస.
12 భారలింగస్వామినీ నిరతంబు మదిలోన నిలపి అవలా
రామదాసూ నెప్పుడూ ఆత్మలో ధ్యానించి మ్రొక్కెదాను.
13 శ్రీసత్యమాంబగురునీ చిత్తమున పదిలముగ నిల్పుకోని
సుగుణాకరస్వాముల పాదముల నిరతంబు మ్రొక్కెదాను.

పరమభక్తికి లక్షణం

14 దాసానదాసులకును శ్రీరామ దాసులకు దాసుడానై
భృత్యానభృత్యులకునూ భృత్యుండ నాతండ్రి శ్రీనివాస.
15 భక్తానభక్తులకునూ తత్ భక్తులా కెల్ల నేను
భక్తుండనై యుండియూ నిను మరువలేనయ్య శ్రీనివాస.
16 విశ్వ మంతయు గురు డికాశాశ్వతా మైనట్టి ప్రభు డాగయూ
ఐశ్వర్యవంతుడాని మ్రొక్కెదా లోకేశ శ్రీనివాస.
17 విశ్వమంతయు ఒక్కడే దేవుండు అనుచునూ మదిలోపల
పెక్కు రూపములతోడ మ్రొక్కెదను పరమాత్మ శ్రీనివాస.

గ్రంథకర్త అభిప్రాయం

18 సకలశాస్త్రంబులాను శ్రీరామ సకలార్థములను నేను
చదువంగలేను యెపుడు శ్రీలక్ష్మిప్రాణేశ శ్రీనివాస.
19 వీతరాగుల నోటను గురుదేవ వినలేదు యీపలుకులూ
శ్రవణ మననా ధ్యానమూ చేయంగ లేనయ్య శ్రీనివాస.
20 శిద్ధు లేమియు తెలియను సద్గురు ధ్యానంబు చేయవాయ
ముద్దుయ్యా దయతోను కొద్దిగా చేసితిని శ్రీనివాస.
21 కేవలా గురు కృపతో కలిగినా పలుకికా కవియు గాదు
కావ్య చందస్సులూను చూడంగ లేదయ్య శ్రీనివాస.
22 ఘనమయిన విద్య లన్ని నేర్వంగ లేదయ్య యెపుడు నేను
ప్రజ్ఞకొరకిది గాదయూ చెప్పనూ పరమాత్మ శ్రీనివాస

23 ప్రజలు మెచ్చునుకాదయా రఘురామ కామినై చేయలేదు
తప్పు ఒప్పులు అన్నియూ లేకుండ చెప్పలేనయ్యా నేను.

24 జనులు మెచ్చెద రంచునూ గ్రంథమూ ఘనులు మెచ్చావలెననీ
యెన్నడూ మదిలో నేను అనుకోలేదయ్యా శ్రీనివాస.

25 అనుమానమూను లేక నాతండ్రి పనిబూని చేయనాయె
మననూ నా గురుని శేవా ఇది యంచు చేసితిని శ్రీనివాస.

సుజన లక్షణం

26 తనయులా తప్పు లన్ని గురుదేవ తలితండ్రి యెంచనట్లూ
తత్వవిధులూ నెప్పుడూ తప్పులు సహించి విసిపింతురూ.

దుర్జన లక్షణం

27 తత్వహీంసలు నెప్పుడూ పద్యముల సారంబు దెలియలేక
తర్కించి తుదకు వారు పద్యముల నిందితురయ్యా యెపుడు.

28 సత్యవంతున కెప్పుడు గురుదేవ చక్కదనంబు లేక
సత్యమునకూ కొరతయూ కల్గదూ నాతండ్రి శ్రీనివాస.

29 మోక్షగ్రంథంబునకునూ శ్రీరామ యతిగుణము కుదురకున్న
అర్థంబు జెడదు దేవ శ్రీలక్ష్మిప్రాణేశ శ్రీనివాస.

విజ్ఞాన లక్షణం

30 వినరయ్యా మీపద్యముల్ చదివియు అర్థములు తెలియరయ్యా
వినయమూ తోడ గురుని చేరుకురు నాతండ్రి శ్రీనివాస.

గురుభక్తికి లక్షణం

31 యేకాంతమునను నేను నుండగా యీపద్యములు తోచెను
నీవు తెల్పిన రీతిగా వ్రాయను ఆయెను శ్రీనివాస.

32 లేనికలలో ముందునూ లేకనే కల్గితీనయ్యా నేడు
గురుని సత్కృప బడసియు యీగుట్టు తెలిసెనూ శ్రీనివాస.

సంసారసాగర లక్షణం

33 సాధనా సంపత్తియు కల్గినా సద్విచారుం డొక్కడు
పూర్వపుణ్యంబువలన పృథివిలో పుట్టును శ్రీనివాస.

34 జననమరణంబు లానె జలప్రవాహంబులో నిలువలేక
సంసారసాగరములో మునిగియు తపియించుచూ నుండెను.
35 మాయజాలం బనియెటి మోహాసుళ్ళలో బడియు తాను
క్రిందుమీదూ ఆగుచుచు నుండెను లోకేశ శ్రీనివాస.
36 ఆశపాశంబు లనియె అరికట్లచాతను యెపుడు తాను
దారపుత్రాదు లనియె సంఘములో యీదలే కుండెనయ్యా.
37 జలజంతువులతో తాను దుఃఖముల్ పొందుచూ నిరతంబున
పిసిరికాయలోపల పురుగువలె తపియించుచుండెనయ్యా.
38 వూపిరీ అడకాను శ్రీరామ ఓపికాయు లేకను
తాపదుఃఖంబులాచె దుఃఖించుచుండెను శ్రీనివాస.
39 యేమిచేతుదు నేనని రఘురామ యెవ్వరూ దిక్కు అనుచూ
నన్ను దాటించువాడు యెవ్వ రని చింతించుచుంటినయ్యా.
40 అని అపర్మితముగాను శ్రీరామ అలాపనము జేయుచుంటి
ప్రేమతోను గురుడు గ్రక్కున చనుదెంచె శ్రీనివాస.

సముద్ర లక్షణము

1 సింధువూ లోపలాను చిక్కిన నరుడందు మునిగి తేలూచుండ
గా ధన్యంబు జెందివుండె నాతండ్రి శ్రీరామ శ్రీనివాస.
2 దైవవశంబునాను వెనుకటి దినములందు యెప్పుడో
పెద్దగాలిచేతను సూత్రముల్ తప్పి నౌకయు మునిగెను.
3 నౌక వచ్చి తేలెను రఘురామ వాని వానిసమీపంబున
వాడు బట్టుక దానిచే దరిజేరినట్టులా శ్రీనివాస.
4 కూడవచ్చెను గురు డటూ శ్రీరామ గాఢ పేదాకు ద్రవ్య
లాభ మబ్బిన యట్టుల ఆయెను నాతండ్రి శ్రీనివాస.

గురు దర్శనము

5 కమలాప్తు డరుదెంచినా శ్రీరామ కమలంబులకు తెల్వియు
నియమంబుతోడ యెపుడు శిష్యుడు ఆరీతి నుండవలెను.
6 కుముదాప్తుడూ వచ్చినా రఘురామ కుముదమూలకు తెల్వియూ
యేరీతి వికశించునో ఆరీతి నుండవలె శ్రీనివాస.

శిష్యుడు గురువును ఆశ్రయించు లక్షణం

47 దేసికాస్వామి నీకు దాసుండ నయ్యేదా నని మ్రొక్కెదా
నాల్గుశుశ్రూషలూను చేయుచు పాదముల పూజించితీ.

48 మీ రావడముతోడను గురుదేవ నేను కృతార్థుః నయితిని
నా జన్మ మీడేరెనూ గురునాథ నన్ను రక్షించవయ్యా.

గురువు తనలో ఆలోచించు లక్షణం

49 తనలోన ఇట్లు అనెను తత్వవేత్తలూనూ షూంచునూ
శరణనూ వారి సెప్పుడూ మది వాని దెరిగియూ తెలిపి రనుచూ.

50 అవునోయి యిటువంటియూ ఆర్యలూ వున్నారు యిలలోపల
నీవు కావలె నన్ననూ నీమీాద ప్రేమతో తెచ్చెదాను.

51 వారి నాశ్రయించితె నీ కిలా మేలపును నీనుము నీవు
వారి నెప్పుడు విడువకా పూజించు నీకోర్కె ఫలియించును.

శిష్య విజ్ఞాపనము

52 పెద్దలూ మీా రనుచునూ గురుదేవ పద్దకీ వస్తినయ్యా
మీాద మిన్నా బడ్డనూ గురునాథ మిమ్ము విడువా నెప్పుడూ.

53 లోకంబులోపలానూ గురుదేవ మీాకంటె పెద్దలూను
వేరనియు లెస్సగాను నామదికి తోచెనూ శ్రీనివాస.

గురు వ్యాఖ్యము

54 యేమి కోరిక నీకునూ వున్నది నాతోను చెప్పు మనుచు
నేమముగ అన్ని నీకు యెరిగింతు వేగమే తెలియు మనెను

శిష్య వ్యాఖ్యము

55 యేమి కోరిక లేదయూ గురుదేవ యేఆశయును లేదయా
వున్న కోరిక లన్నియు అణగంగ జేసేది తెల్పుమయ్యా.

56 యేసాధనంబుగాని గురుదేవ తగు సాధనం బైనదీ
యేయోగమును గానిదీ గురుదేవ అది దెల్పుమయ్య నాకు.

57 జపతపాములు లేనిది జన్మామృఖ కుపితమార్గము కానిదీ
క్రతువ్రత నేమములునూ కానిది తెలుపుమయ్యా నాకును.

### గురు వ్యాఖ్యము

58 ఆయోగ మబ్బుటయును ఓశిష్యా అతిదుర్లబం బడియునూ
కాదు నీచేత యెప్పుడూ కష్టతర మయ్యే వుండునూ.

59 అతిసూక్ష్మ సుజ్ఞానికి పదిరెండు సంవత్సరంబులకునూ
అజ్ఞానికీ అయితేనూ యిరువదినాలుగేండ్లకు తెలియునూ.

60 అతిమూఢునకు ముప్పదీ ఓశిష్యా అతింటికీని అబ్బును
యిన్నిటికి తక్కువ ఏమున్న నరునకూ అంతు లేదు.

61 అన్నియోగంబులాను ఓశిష్యా అభ్యశించితేను గాని
యెన్నగా పరలోకముంకూ యెప్పుడు యేగవచ్చూ వినుము.

### శిష్య విజ్ఞాపనము

62 యిన్నిదీనంబులున్నా యీయోగమును జేయుచున్నందుకు
దీనికి ఫల మేదియో దాచక చెప్పవే గురువరేణ్యా.

63 యేయోగ ముయినగాని శ్రీరామ చేయబూనినవాడను
తాపదుఃఖంబులూను బాయను లోకేశ శ్రీనివాస.

64 మీదు శేవకు పాత్రుడా యిఖు యింతికన్న లేదు మిత్రుడా
పోదోలుమయ్య మాయ పాదు లేకుండ శ్రీనివాస.

## గురునకు చదుర్విధ శుశ్రూశల వివరములు

### స్థాన శుశ్రూష వివరం

65 స్థాన శుశ్రూషయూను సద్గురుడు వుండునట్టీ స్థలమునా
మలినమూ లేకుండను చేయుమనె శ్రీరామ శ్రీనివాస.

66 ఆసనాశయనాదులు అన్నియూ జరిపియూ వేగముగనూ
జపతపా అనుష్టాన జయుతతూ లొనరించి శ్రీనివాస.

67 పుష్పఫలాదులాను తెచ్చియు గురుని సంగం బుంచియూ
నిరతంబు మదిలో తాను చేయుచూ నుండవలె శ్రీనివాస.

68 దనధాన్య దారపుత్రుల్ పశువర్గమూలాను యల్లప్పుడూ
కాపాడుచుండవలెను వినయమూ తోడనూ శ్రీనివాస.

## అంగశుశ్రూష వివరం

69 అంగశుశ్రూషయూను చేయవలె అగురుని దేహసర్వాంగము
లనూ, మలినమూ లేకుండను స్నానంబు చేయించమని తెల్పెను.

70 మంచివస్త్రాంబులాను భూషణములు మంచిగా నుంచవలెనూ
పాదపూజాదులాను భక్తితో చేయవలె శ్రీనివాస.

71 సేవించి అర్చించియు వినుతించి కృపకు పాత్రుడు కావలె
గురి తెన్ను సిలిపి తాను వుండవలె పరమాత్మ శ్రీనివాస

72 వుపచారములు చేయుచూ గురునకూ అపకారమూల మూని
వుపకారములు అన్ని జేయుచునుండవలె శ్రీనివాస.

## భావ శుశ్రూష వివరం

73 భావశుశ్రూషయూనూ మనసులో భక్తిశ్రద్ధలతోడనూ
బాగుగా చేయుచూను వుండవలె పరమాత్మ శ్రీనివాస.

74 తన తల్లి తండ్రీ దారపుత్రులు ధనము సహోదరులునూ
తనువు మనసు అన్నియు గురునీ సొమ్మయ్యె శ్రీనివాస.

75 గురుడె దైవం బనుచునూ దాతయు భ్రాతయూ ధన మటంచు
తల్లి తండ్రూ లంతయు గురుడనీ తెలియవలె శ్రీనివాస.

76 గురుడె అనాది ఆదిగురుడే ప్రియుమయినవాడు యనుచూ
మహిమ దెలిపిన గురువును మరువకా తలచవలె శ్రీనివాస.

## ఆత్మ శుశ్రూష వివరం

77 ఆత్మశుశ్రూషయూనూ గురునకూ అతిశయంబుగ జేయుము
అంతరంగములోపలా గురునకు సల్పవలె శ్రీనివాస.

78 గురుడె దైవం బనియునూ మనసులో గుణితోను తెలియవలెను
తెచ్చి సమర్పించియూ నిరతమూ చేయవలె శ్రీనివాస.

79 యిష్టములనూ దీర్చియూ ఆవలా కష్టములు రాకుండనూ
కాపాడవలయు వాని కరుణనూ పొందవలె శ్రీనివాస.

80 గురుడు కోరినదంతయూ కొనినచ్చి యిచ్చుచూ నుండవలెను
మరువకా యెల్లప్పుడూ వుండవలె నాతండ్రి శ్రీనివాస.

81 సంతోషమును బొందియు గురుకరూ చింత లన్నియు బోవలె
పంతమూ లేక యిన్ని పద్ధతుల చేయవలె శ్రీనివాస.

### సాధనచతుష్టయములు, నిత్యానిత్య వస్తు వివేకం

82 సత్యంబు బ్రహ్మమనుచు నసత్యంబు జగ మనియునూ
నిత్యమూ మదిలోపలా భావించుచుండవలె శ్రీనివాస.

83 తన శరీరమూ భార్యయూ తనయులూ యిల్లు వాకిలి ధనమునూ
లేనివని యెప్పుడు మదిలో భావించవలెనయ్య శ్రీనివాస.

84 భూనభోంతరములు గురుదేవ బుధదేవ దానవులునూ
మానసమునా యెప్పుడు మాయనీ తెలియవలె శ్రీనివాస.

85 బ్రహ్మవిష్ణీశ్వరులునూ మిగిలినా బ్రహ్మాండ మంతయూను
అన్నియూ మిథ్య యంచూ ఆశనూ మానవలె శ్రీనివాస.

86 శాశ్వతా బ్రహ్మ మొకటి స్థిరమని సత్యముగ నమ్మవలెను
ఆసించి వుండవలెను తనలోన మరువకా శ్రీనివాస.

### యిహ మూహాముత్రార ఫల భోగ విరాగములు

87 యిహలోక సుఖము లనియు గురుదేవ పరలోక సుఖములనియు
రెండువిధముల నుండునూ నాతండ్రి లోకేశ శ్రీనివాస.

88 మిద్దెలూ మేడలూనూ వెలగల వస్త్రభూషణమూలునూ
వనితభోగములన్నియూ యిహలోక సుఖములూ శ్రీనివాస.

89 పుష్పచందనమూలునూ అత్తరూ పన్నీరు గంధములునూ
యివి అన్నియూను జేరి యిహలోక సుఖములూ శ్రీనివాస.

90 స్వర్గ వైకుంఠ సత్య కైలాసములను గోరూచుండుటా
పరలోక సుఖములాని అందురూ ఫణిశాయి శ్రీనివాస.

91 రంభ వూర్వసి మేనకా రమణులా పొందు కావలె ననుచును
భ్రాంతిజెందివుండుటా పరలోక సుఖములూ శ్రీనివాస.

92 యీరెండు విధములైన సుఖములా వదలవాలెను యెప్పుడు
అరమరా లన్ని మాని గురువునూ నమ్మవలె శ్రీనివాస.

## శమాది షట్క సంపత్తి వివరం

93 శమ దమా ముపరతి యును శ్రద్ధ తితిక్షసమాధానము
అనుచు ఆరూవిధములూ వుండును శ్రీలక్ష్మి శ్రీనివాస.

94 అంతరేంద్రియంబులా చంచలము కాకుండ నిలుపవలెను
ఆతీరు నిలిపితేను యమ మనిఅందురూ శ్రీనివాస.

95 బాహ్యేంద్రియంబులాకు చలనంబు కాకుండ నిలుపవలెను
ఏకముగ నిలిపితేను నియమ మని అందురూ శ్రీనివాస.

96 సకలపుణ్యంబులానూ చేయగా వుపరతి అందురయ్యా
సుఖదుఃఖములకు ఓర్చి వుంకుట తితిక్ష శ్రీనివాస.

97 గురువు చెప్పిన బోధను తెలుసుకొని బుద్ధితో యోచించి దియు
ఒకటనీ గ్రహించినా సమదాన మానయ్య శ్రీనివాస.

98 సకలవేదాంత శాస్త్రములలోని రహశ్యముల తెలిసి తాను
యివి యన్ని యోచించగా శ్రద్ధ యని అందురూ శ్రీనివాస

## ముముక్షత్వ వివరం

99 తన గృహం బగ్ని చేత దగ్ధంబు నయ్యె నని తెలిసియూ
తాను పరుగెత్తియూను వేగముగ పోవుగద శ్రీనివాస.

100 ఘోరకూపారణ్యము లోపల తాపత్రయాగ్ని చేత
కాలుచూ వున్నదనియు మోక్షమును వెతకవలె శ్రీనివాస.

101 అత్యాదరణతోడను గురువునూ అతితీవ్రముగ వెతికియూ
సంతాప మొందుచుండు సద్గురువు లెవరని శ్రీనివాస.

102 యింత పరితాప మొంది గురునకు యిఘ మొక్క వెవ్వరానీ
సతతమూ వెతుకు టిదియె ముముక్షుత్వ మగునయ్య శ్రీనివాస.

103 అభ్యాసయోగంబునూ ఓశిష్య అది నీకు యెరిగించెదా
అష్టాంగ యోగముల తెలిపెద శ్రద్ధతోడుత తెనియుమూ.

104 చిత్తంబు పరిపక్వము కానివారకు కర్తవ్య మై యుండునూ
వుత్తమా గురుసేవను మనసులో మరువకా శేయు మనెను.

105 సత్తతోడుత అన్నియూ చేయగా మత్తన్నియు బాయును
మరి బ్రహ్మ జ్ఞానంబును దినదినము అభివృద్ధి అగుచుండును.

106 సత్తతోడుత కల్గునూ సర్వయోగములు మొత్త మవ్వుచు
వెలుగునూ, అక్షరీ అన్ని నీవు చిత్తంబులోపలా తెలియవలెను

## అష్టాంగ యోగములు

107 యమము నియమమూ రెండునూ ఆసనయోగ ప్రాణాయామము
లివి నాలుగూ ఆయోగ యికగలవు వినుమనె శ్రీనివాస.
108 ప్రత్యాహార ధారణా ధ్యాన్న సామాధులూ నాలుగు
సతతమూ యీయోగమిదీ సేయుమనె లోకేశ శ్రీనివాస.

## యమ లక్షణం

109 యేయాత్మ నైనగాని ఓశిష్యా హింస జేయంగబోకు
కాయంబులోపలాను మరువక వుండ మనె శ్రీనివాస.
110 బ్రహ్మ సత్యం బనుచునూ మిగిలినా బ్రహ్మాండ మంతయూను
అస్తిరం బనుచు యెపుడు బుద్ధియం దుంచుమనె శ్రీనివాస.
111 తనపత్నియూ తోడనూ ఓశిష్య ఋతుకాలమూలయందు
కలయుచూ మెలయుచూను కాంక్ష లేకుండు మనె శ్రీనివాస.
112 తన శత్రువులతోడను ఓశిష్య తగ దుఃఖములు కలిగినప్పుడూ
చలన మింతయు లేకనూ వుండు మనె నాతండ్రి శ్రీనివాస.
113 తనయందు వుండేటియు తగు కామగుణములా యెల్లప్పుడు
ఆడగించీ వాటిని మది నిల్పి జిడ్డు దీయూ మనెను.
114 వేదాంత వ్యాఖ్యంబులే భవవార్ధి దాటించు ననుచు తెలిసి
కాదనక మదిలోపలా స్థిరముగా నమ్ము మనె శ్రీనివాస.
115 సకలజీవాత్మలూను తన ఆత్మవలె నని అనుచు తాను
సంకల్పములు లేకనూ సమముగా చూడమనె శ్రీనివాస.
116 పుత్ర మిత్రాదులందు ఓశిష్య కాళత్ర శత్రువులందున
సతతంబు సమబుద్ధియూ యుండు మని తెలిపెను శ్రీనివాస.
117 యోగమువకూ యెప్పుడూ ఓశిష్య అనుకూల మైన మంచి
భోజనము చేయుమాని చెప్పెను నాతండ్రి శ్రీనివాస.

118 ఒకపాలు భోజనమును ఓశిష్య ఒక్కపాలూ జలమును
ఒక్కపాలు వాయివుకూ పీల్చుచూ నుండ మనె శ్రీనివాస.

119 కాలదేశామునుంచి కర్తేది యేగి అయితే నేమని
మేలుగా స్వీకరించ మితహార మని తెల్పె శ్రీనివాస.

120 తన శరీరమునందునా మలినమూ లేకుండగాను యెపుడు
స్నానంబు జేయుటయును బాహ్య శౌచంబు అని తెల్పెను.

121 పరిశుద్ధుడను నేను అనుచు తెలిసి ఓశిష్య జ్ఞానంబు బొందుట
యును, అంతరంబైనట్టియు శౌచంబు అని తెల్పె శ్రీనివాస.

## నియమ లక్షణం

122 నియమదశకం బనేది ఓశిష్య నీకు యెరిగించెదానూ
వేదోక్తముల చేతనూ యీతనుపు విదితమూ శ్రీనివాస

123 శృతిస్మృతు లనుచును దెలసియూ విశ్వశించూటూయెను
ఆస్తిక్య మాను యనుచూ తెలిపెనూ నాతండ్రి శ్రీనివాస.

124 గురువ్యాఖ్యానమునమ్మియు గురుతుగావర్తించుచూ నుండెనూ
ఆస్తిక్య మందురాను తెలిపెను నాతండ్రి శ్రీనివాస.

125 తనకు లాభించినట్టి పరతత్వ మార్గంబు అంతయూను
తత్వ మరసేవారికి తెలిపితే వుత్తమ దానం బనె.

126 శక్త్యానుసారంబుగా చెలగియు బ్రహ్మలి నర్చించుమూ
యీశ్వరార్చనంబును చేయుచు నుండుమానీ తెలిపెనూ.

127 రాగాది గుణదోషముల్ రహితుడై యెప్పుడూను మరువకా
సత్యవాక్యంబులాను పలుకుచూ నుండు మనె శ్రీనివాస.

128 హింసలూ జేయకాను ఓశిష్య యిలకర్మలూ జేయుచూను
యీశ్వరాపూజనంబు అవు ననీ తెల్పెను శ్రీనివాస

129 వైదీక లౌకీకముల్ ఓశిష్య వరుసమార్గంబులాకు
వరుస దప్పిన కర్మను వదలు మని తెల్పెనూ శ్రీనివాశ.

130 వేద శాస్త్ర పురాణ వేదాంత శిద్ధాంత యితిహాసముల్
అభ్యసింపూ మనుచునూ తెల్పెను నాతండ్రి శ్రీనివాస.

131 గురువాక్యమూల యెపుడు నిరతంబు స్మరియింపుచుండవలెను
వృత్తమా ప్రతిమానియూ అని చెప్పె నాతండ్రి శ్రీనివాస

132 దేహేంద్రియాములాపై తెంపుసూ కలిగుంటుటే ఆసనం
మిథ్యాప్రపంచంబునూ మథ్యాగా దోచుటే ప్రాణయామం.

## ఆసనా లక్షణములు

133 యెనుబదినాలుగులక్షలా జీవులకు యెనుబదినాలుగులక్షలు
ఆసనంబులు అన్నియూ ఆయె నని తెలిపెను శ్రీనివాస.

134 యెనుబదినాలుగులక్షలా ఆసనంబులలోనూ ముఖ్యము
ఆసనంబులు నాలుగూ ఆయెను అని తెల్పె శ్రీనివాస.

135 శిద్ధాసనాము పద్మ సింహా భద్రాసనములు నాలుగు
శిద్ధు లొసంగునాసి కాయశిద్ధులా నిచ్చు నాని తెలిపెను.

## సిద్ధాసనము

136 పాయకా వినుము వీటి పద్ధతీ సూక్ష్మమూగా తెలిపెదా
న్యాయమూగా జేసితె అవుసు శిద్ధులూ నిజ మానెనూ.

137 వామపాదంబు నెపుడు పర లింగస్తానంబుపై మెడిమ నుంచీ
దక్షిణా పాదంబును తగు దానిపై నుంచు మనె శ్రీనివాస.

138 మనసు భ్రూమధ్యమునను నిల్పియు చక్కగా కూర్చుండియు
చూపురూపున జేర్చితె శిద్ధాసనం బౌనసీ తెలిపెనూ.

## పద్మాసనము

139 యెడమతొడమీదనూ ఓశిష్య కుడిపాదమును వుంచియూ
కొడితొడపైన అపుడు యెడమపాదమును వుంచు మనెను

140 యెడమతొడపై నుండెడి కుడిపాదమును కుడిహస్తమూ చేతను
కుడితొడపైనుండెటి యెడమపాదమును యెడమహస్తము చేపట్టుమనెను.

141 గడ్డమూను రొమ్ముకూ నాలుగంగులములపై నుంచియు
చూపునూ రూపునందు చేర్చితే పద్మాసనం బౌననె.

## సింహాసనము

142 రెండు ఆడుంబులాను క్రింది నరములయందున
తొడల వెనుక కుసోకునట్లు కుడయెడమపాదములు వుంచుమనెను.

143 రెండు మోకాళ్ళపైన ఓశిష్యా రెండు హస్తంబులాను
పూతకొని నోరు దెరచి సక్క కూర్చుండ మని తెలిపెనూ.

144 ఏకాగ్రముగను దృష్టి కల్పుకొని చక్కగా మనసు నిల్పి
గ్రక్కునా చూచు టిదియె ఒక్క టే శింహాసనం బాయెనూ.

## భద్రాసనము

145 బీజనరములక్రిందనూ ఓశిష్య కుడియెడమ మడమలను జేర్చి
ఏభాగమునకువుంచేఆభాగమునకువుంచితే భద్రాసనంబౌనని.

146 రెండు ప్రక్కలనుండిటు ఓశిష్య రెండు హస్తములచేత
బిగువగానూ బట్టినా నదియె గోరక్షులా అని తెల్పెను.

## నాడిశోధన ప్రాణాయామ లక్షణం

147 పద్మాసనాశీలుడై ఓశిష్య పరగిన యోగియును
ప్రాణవాయువు నెప్పుడు పదిలముగ నిలుపవలె నని తెల్పెను.

## ఎడమముక్కుపుటకతో చేయుట

148 యిడనాడిచేతను ఓశిష్య వాయువును రేచించియు
రేచించిన నాడిచే పూరించి కుంభకము చేయు మనెను.

149 కుంభకము జేయునట్టి వాయువును రేచక పూరకంబులచేతను
యిడపింగళద్వారను మార్పును చేయుచూ దించ మనెను.

## కుడిముక్కుపుటకతో చేయుట

150 పింగళనాడిచేత ఓశిష్య వాయువు రేచించియు
రేచించిన నాడిచే పూరించి కుంభకము చేయు మనెను.

151 కుంభకము జేసినట్టి వాయువును రేచక పూరకంబులచేతను
యిడపింగళాద్వారను మార్పును చేయుచూ దించ మనెను.

## రెండు ముక్కుపుటకలతోను

152 యిాడ పింగళనాడులచేతను వాయువును రేచించియు
రేచించినా వాటిచే పూరించి కుంభకము జేయు మనెను.

153 కుంభకము జేయునట్టి వాయువును రేచక పూరకంబులచేతను
యిాడపింగళద్వారను మార్పును చేయుచు దించ మనెను.

154 యిావిధంబున శ్రద్ధతో ప్రతిదినము మూడువేళలయందున
మూడునెలలూ జేసితే నాడీను శుద్ధియగు నని తెలిపెను.

## ప్రాణాయామము

155 సీ॥ వినుము ప్రాణాయామవిధ మంత వివరింతు
చెప్పినరీతిగా చేయు మనెను
మనసులో సంకల్పమును లేక యెప్పుడు
స్థిరముగా నీబుద్ధి జేర్చు మనెను
యిావిధంబున నీవు విని జేయుచుంటివా
నీకు సిద్ధించును నిజముగాను
యిదియె ప్రాణాయామ సదమలమార్గంబు
విబుధనిర్ణయ మని విశద మగును

అనుచు యిారీతి మనమున ననుదినంబు
మూడువేళల యిారీతి ముదముగాను
ఆచరించుచు మోదంబు నందునట్లు
చేయనేర్తును నే నింక శ్రీనివాస.

156 సీ॥ ఏకాంత నిలయంబు నేర్ప జేసియు
శుద్ధ అమనస్కుడై శుద్ధి పరచి
అత్తరు పన్నీరు అగరుబత్తులు పునుగు
జవ్వాజి పరిమళ సముదయముగ

మధ్యరంగంబున మణిపీఠ మమరించి
హరినాజినము ధవళాంబరంబు
నెరపి సిద్ధాసననిష్ఠతో కూర్చుండ
మనియు నిర్దేశించె ఘనముగాను
వినియు శిష్యుడు మదిలోన విస్మయముగ
నేను జేసెద నని పల్కె నేర్పుతోడ
పరమగురుమూర్తి పద్ధతి పరిణమించి
చెప్పినట్టుల జేసితి శ్రీనివాస.

ఎడమముక్కున జేయుట

157 సీ॥ సిద్ధాసనంబున స్థిరముగా కూర్చుండి
యిష్టదేవుని మది నెంచు మనియె
నోరు కండ్లను మూసి నిక్కి కూరుచుండియు
చూపు మనసును భ్రూమధ్యమునను జేర్చి
యిడనాడి రేచించి తడయక పూరించి
కుంభక మొనరించి కుదురు పరచి
హితముగా నీరీతి నిడనాడి గతి నెంచి
యెంతదాక నది నితాంత మగునో
అనుచు నీరీతి జెప్పెను ఆర్యు డపుడు
వినియు శిష్యుండు మదిలోన విస్మయముగ
గురుని సముఖమున నిలిచి సురుచిరముగ
చెప్పినటులను జేసితి శ్రీనివాస.

158 సీ॥ డింభక యీరీతి కుంభక మొనరించి
దింపుము క్రిందికి ధీరుడవయి
యెడమముక్కును మూసి కుడిముక్కు దెరచియు
యెంచి నాల్గింట రేచించవలయు
రేచించినంత పూరించగా వలయును
కుడిముక్కునుఁ మూసి యెడమ దెరచి

యొంచి నాల్గింట రేచించవలయును
రేచించినంత పూరించవలయు
మరియు కుడియెడమల రెంటి మార్చిమార్చి
శ్వాసవేగంబు నణచగా వలయు ననియె
గురుడు బల్కిన రీతిని మరువ కతడు
చెప్పినట్టుల జేసెను శ్రీనివాస.

కుడిముక్కున చేయుట

159 సీ॥ ఏర్పడగా దాను నెడముక్కున
ప్రాణయామంబు జేసియు యవధి గనెను
కుడినాడి రేచించి తడయక పూరించి
కుంభకం బొనరించి కుదురు పరచి
కోర్కతో నీరీతి కుడినాడి గతి నెంచి
యెంతదాక నది నితాంతమగునొ
పదిలంబుగా కుడి ప్రాణయామంబు
సలిపి సలిపిన దానిని సాధ్యపరచు
అనుచు నీరీతి గురు డిల ననుదినంబు
శిష్యునకును బోధించె విశేషముగను
బాధ లేనట్టి యీగాధ బోధ గనియు
చెప్పినట్టుల జేసెను శ్రీనివాస.

సీ॥ కుంభక యీరీతి కుంభక మొనరించి
దింపుము క్రిందికి ధీరుడవయి
కుడిముక్కునుగ మూసి యెడముముక్కుగ
దెరచియు యొంచి నాల్గింట రేచించవలయు
రేచించినంత పూరించగావలయును
యెడమముక్కును మూసి కుడిని దెరచి
యొంచి నాల్గింట రేచించగావలయు
రేచించినంత పూరించవలయు

యెడమ కుడులను మార్చుచు విడువ కెపుడు
శ్వాసవేగంబు నణచగావలయు ననియె
గురుడు బల్కిన రీతిని మరున కతడు
చెప్పినట్టుల జేసెను శ్రీనివాస.

### రెండుముక్కులతో చేయుట

161 సీ॥ ప్రాణాయామము కుడిప్రక్కన జేసియు
అలసట దీరగా నిలచె నవల
రెండుముక్కుల నిపుడు ఖండితంబుగ జేయు
మనుచు గురుడు బల్కె యవసరమిదె
రెండుముక్కుల వాయువు రేచించి వేగమే
రేచించినంత పూరించవలయు
వేగమే పూరించి రేచింపబోకను
కుంభకం బొనరించి కుదురు పరచు
యెంతవరకు నిల్ప నితాంత మగునొ
అంతవరకును నిలుపుము చింత లుడిగి
అనుచు యీరీతి తెలిపెను ఘనుడు గురుడు
చెప్పినట్టుల జేసెను శ్రీనివాస.

162 సీ॥ మించు కుంభకమును దించగావలయును
మరి రెండుముక్కుల తెరచి వేగ
శ్వాస నాలుగంగులాల్ సమముగా రేచించి
రేచించినంత పూరించవలయు
ఆవిధంబున శ్వాస మణచుచు పూరక
రేచకముల మార్చి చూచి దించు
ధీరుడ యీరీతి దించి సాధించిన
దీన శుభము గల్గు దాని గనుము
అనుచు గురు డిటు బలుకగా వినియు తాను
మార్గ మంత దెలియగా మదిని నెంతొ

ప్రియము చెందుచు గురునాన చేయ నెంచి
చెప్పినట్టుల చేసెను శ్రీనివాస.

163 సీ॥ దినదినము మూడు వేళల దీని నీవు
అయిదునూ ర్లెంచువరకును వ్యవధితోడ
కుంభకము చేయవలయును డింభక విను
అట్టియోగికి చెమటలు పట్టు మొదట
అంనుపై నైదువే లెంచునంతవరకు
చేయుయోగి యాసనము పై నట్టెదుముకు
శక్తి కల్గును విజ మిది యుక్త మగును
అందుపైని పదైదువేల్ అమరువరకు
పరగ జేసిన యోగికి బ్రహ్మరంధ్రమునను
హంస వెలుగుచుండు గనుము నిజము

సంచితాదులు నెన్నైన సమసిపోవు
కోర్కె లన్నియు నీడేరు కొదువ లేక
అనుచు యీరీతి బల్కెను ఘనుడు గురుడు
చెప్పినట్టుల చేసెను శ్రీవాస.

## ప్రత్యాహారము

164 వినుము ప్రత్యాహారము ఓశిష్య విధి మెట్టులా అన్నను
నాల్గువిధంబులాను వుండును రఘురామ శ్రీనివాస

165 యింద్రియా వ్యాపారములా వెంబడి వర్తింపజేయక నుండు
నొకటె స్థిరముగా నిల్వవలెను మనసును లోకేశ శ్రీనివాస.

166 యింద్రియాముల్ అన్నియు చలియించి కార్యకార్యము
లన్నియు, గడుపుచూనుండునపుడుఆత్మయేనని తెలి పె శ్రీనివాస.

167 వదలకా దేహమందు పదునెనిమిది స్థానములను
మెదలకా వాయు వుంచి పదిల పరచవలెనయ్యా శ్రీనివాస.

## ధారణాయోగ వివరం

168 ధారణా యోగంబును ఓశిష్య తగ నెరిగించెదాను
తప్పకా వినియు నీవు చేయుచూ నుండుమనె శ్రీనివాస.

169 మనసు సంకల్పంబునూమరియేది చేయునో దేసిదేనినితలచునో
అవి అన్ని ఆత్మ యనియు మదిలోన నెంచుమనె శ్రీనివాస.

170 చెందజేయును ధారణం అణిమా మహిమలు పొందజేయును
స్మారణం,యిందునాలఘిమగరిమా ప్రాప్తిప్రాకామ్యములు శ్రీనివాస

171 చూచుట వినుటయూను తాకుటా తినుటయూను సుమ్మీ
ఆఘ్రాణించుచు అన్ని ఆత్మయే నని తెలియవలెను.

172 వినుము ఆధారమూన విఘ్ననాథునియందున మనసునూ
పొందనిలిపి స్వాధిష్టకమలమున వుంచుమనెను.

173 మణిపూరకమందునా నిల్పియు అనహతమందునాను
మనసునూ నిలుపమని తెలిపెను శ్రీరామ శ్రీనివాస.

174 విశుద్ధకమలమునను మనసునూ నిల్పియూను ఆవలా
ఆగ్నేయ కమలమందు చేర్చుమని తెల్పెనూ శ్రీనివాస.

175 సహస్రకమలమందు సద్గురూవందునా మనసు నిల్పి
సకలదేవతలయందు సన్నుతి చేయుమానీ తెలిపెను.

## ధ్యాన యోగము

176 సగుణధ్యానంబునూ శ్రీరామ నిర్గుణధ్యానంబునూ
అని రెండువిధములూను అయ్యెండు నాతండ్రి శ్రీనివాస.

177 సగుణంబు అనగనయ్యా తన హృదయ పీఠ కమలమునందున
సర్వేశ్వరరూపములలో ఒకరూపు నిలుపమూనీ తెలిపెను.

178 సకలవస్తువులందున యీశ్వరారూప మొక్కటెయనుచునూ
పూజను జేయుచూను నుండమని తెల్పెనూ శ్రీనివాస.

179 బాహ్య మందేది కోరుకోకా సహజముగ లోపలా
సంకల్పమూను జేసి పూజలు చేయుమనె శ్రీనివాస.

180 సకలేంద్రియంబులూనూ నిఖిలోపకరణంబు ప్రాణంబులూను
వుపకారభటుల జేసి పూజానూ చేయమనె శ్రీనివాస.

181 గంగ త్రివేణులాను ఘనజలంబుల దెచ్చియు
కమలపట్కముతోడను పూజను చేయుమని బోధించెను.

182 జఠరాగ్ని దీపంబును చిత్కళలు ఆనంద నైవేద్యముల్
అర్పితం బొసరించియు నుండుమనె నాతండ్రి శీనివాస.

183 మండలాత్రయములాను మరి హారతులను జేసి
దేహాలయమునందున జ్యోతిని వెలిగించుమని తెలిపెను.

184 దేదీప్యమైనసహాస్ర కమలపీఠ మందునా
సాహసంబున శాంతిచే శ్రీరాము పూజించు మని తెల్పెను.

## సమాధి వివరం

185 సవికల్ప మరియు నొకటి నిర్వికల్పం బొకటని
రెండు విధములు గలవని చెప్పెను నాతండ్రి శ్రీనివాస.

186 మొదట దోచున వెల్లను చిదాభాషుకలగ చెరిగియూ
తన కవియు వేరు గావని దెల్పియు బాహ్యాసవికల్ప మనిదెల్పెను

187 ఆగ్నేయమందునాను అగుపడూ కళ లన్నియూను
వింతగా చూచుచుండె అంతరస వికల్ప మని చెప్పెను.

188 యింటిలో ప్రణవనాదం తప్పకా వినుచుంటెను
అంతరస వికల్ప సమాధి అని తెలిపె శ్రీనివాస.

189 బాహ్యా దృశ్యంబులాను శ్రీరామ బాహ్యా శబ్దంబులాను
కను విను ఆత్మ అనుట బాహ్యా సమాధి అని తెల్పెనూ.

190 అంతరా దృశ్యంబును రఘురామ అంతరా శబ్దంబునూ
వినునదే ఆత్మ యనుట అంతరా నిర్వికల్పం బనియెను.

## హంస వివరం

191 అజపగాయత్రీయునూ శ్రీరామ జపము జేయుచుండినా
తనకు తానె జపమునూ చేయునూ లోకేశ శ్రీనివాస.

192 వుదయమూ నుంచియూను మరల వుదయము వరకునూ
షడధారములను జుట్టి తిరుగుచూ నుండునానీ తెలిపెను.

193 యిరువదీ ఒక్క వెయ్యి శ్రీరామ ఆరునూరుల హంసలూ
తరుగు అరవైఘడియలా ఆయువు చనిపోవు శ్రీనివాస.

194 చక్కగా మది నిల్పియూ రఘురామ చేయువలయును తా
నికా, సక్రమముతోడ ఆరుచక్రాలయందున శ్రీనివాస.

195 చయ్యనా రేచకములా శ్రీరామ పూరకంబుల చేతనూ
సరగునా కుంభకములా సాధించవలెనయ్య హంస జపము.

196 ఆధార కమలమూన ఆరునూరుల జపంబును
ఆదివినాయకునికి అర్పితం బొనరించు శ్రీనివాస.

197 స్వాధిష్టకమలమునకు చయ్యనా చనుదెంచియూ
బ్రహ్మకు ఆరువేలా హంసలు అర్పితం బొనరించు శ్రీనివాస.

198 మణిపూరకమును జేరి శ్రీరామ మహి రక్షకునకునూ
ఆరువేలా హంసలూ సమముగా జపియించు శ్రీనివాస.

199 అనహాతాపురమునాకు చనుదెంచి హరునకూను అంతయే
అరువేలా హంసలు అర్పితం బొనరించు శ్రీనివాస.

200 విశుద్ధ చక్రమూన జీవునకు ఒక్క వెయ్యిహంసలూ
అర్పితం బొనరించునూ నాతండ్రి రఘురామ శ్రీనివాస

201 ఆగ్నేయకమలమునకు చనుదెంచి అచట సాదాశివునకూ
ఒక్క వెయ్యిహంసలూ అర్పితం బొనరించు శ్రీనివాస.

202 సహస్రారకమలమందు శ్రీరామ సద్గురుమూర్తి కెప్పుడూ
వెయ్యిహంసల కాలమూ అజపంబు అవునుగద శ్రీనివాస.

203 సచ్చిదానందా రసామృతంబును గ్రోలియూ
సమర సైక్యంబనే సమాధి అగు ననెను శ్రీనివాస.

204 జడదృశ్య సముదయంబు దృగ్వాది వస్తువూలు
దృశ్యంబు లన్నియూను నశ్య మని చెప్పెనూ శ్రీనివాస

205 అన్నియూ కడద్రోయగా ప్రత్యగాత్మయే మిగులుండును
నదియె పరమాత్మరూప మని తెలిపె లోకేశ శ్రీనివాస.

206 యీవిధంబున యెప్పుడూపరమాత్మ రూపమయి నిలిచినపుడూ
సగుణసమాధియగునూ అని తెల్పె రఘురామ శ్రీనివాస.

## నిర్గుణ సమాధి అనుభవము

207 అంతరంబందునాను నగుపడు దృశ్యజాలం బంతయూ
అంతఃకరణ దృశ్యము లనుచును తెల్పెనూ శ్రీనివాస.

208 శబ్దంబునూ యెప్పుడూ నాదంబులో జేర్చియూ
నాదంబు ఆత్మలోన జేర్చియు వుండుమనె శ్రీనివాస.

209 అంతరాబాహ్యమునను దృశ్యశబ్దం బణగిన
ఆత్మయే మిగిలివుండూ అని తెల్పె నాతండ్రి శ్రీనివాస.

210 నిస్తరంగంబైననూ సిందుసముద్రమురీతిగా
గాలి లేనట్టి జ్యోతి కరణిగా వెలుగుచూ నుండు మనెను.

211 సాధనంబులు యిన్నియూ శ్రీరామ సాధించువారి కెపుడూ
సర్వశక్తియు కల్గును అని తెల్పె రఘురామ శ్రీనివాస.

212 స్వర్గాదిలోకములకూ పోవనూ రావడము అగునననూ
యెన్ని జేసినను గాని అన్నియూ తానౌను శ్రీనివాస

213 మన్ననా పొందునయ్యా శ్రీరామ మహిలోన యెపుడు తా
యేది కోరినను గాని యెదురుగా వచ్చునాని తెల్పెను.

214 నూటికీ ఒక్కరికి యిటు జేయు దీటుపడునూ వీనుము
కోటికీ ఒక్కరికి యోగము శిద్ధించు నని తెల్పెను.

## శిష్య విజ్ఞాపనం

215 యోగసాధనములను గురుదేవ బాగుగా జేసితయ్యా
మేలేమి లేనట్టుగా తోచెనూ నాతండ్రి సద్గురువరా.

216 పరలోకమునకు బోయి గురుదేవ మరలివచ్చుటకంటెను
యీలోకమునకు సాటి యించుమించుగా వుండునయ్యా.

217 అది నీకు యెట్లు తెలిసె అనియునూ ననెదరేమో మీరును
ఒక అంగడిలో గుడమును వున్నదే ఇతరఅంగడు లందును

218 ఒకపట్టణంబు సాటె గురుదేవ ఒకపట్టణంబుగాని
యిక యెక్కువేదియూను లేదయ్యా నాతండ్రి గురువరేణ్యా.

219 యీలోకప్రభువులంత గురుదేవ యిలజనులందరూను
యేలాగు నటుదెంతురో అందరూ ఆలాగు చనుదెంతురు.

220 బ్రహ్మ విష్ణ్వాదులూను మిగిలినా బ్రహ్మాండ మంతయూ
లోకేశు లందరూను యెప్పుడో చనుదెంచి పోదురయ్యా.
221 యీలోకమున వాసము వున్నాను మొదలె ప్రార్థించుచుంటి
సంశయంబూ లన్నియూ దీర్చవే నాతండ్రి గురువరేణ్యా.

## గురువాక్యము

222 అట్టిశిష్యుని గురుడు మనసులో ఘట్టివాడని మెచ్చక
ప్రకటించనూ బూనెను యెటు నేను జనిన యీభేలు చెడునను.
223 యేదయిన చెప్పియూను పోదము అనుకున్న గాని వీడు
విడిచెట్టుగ లేదని ప్రేమతో గురుడు అంచుకు పిలచెను.
224 యేది జెప్పినదుగాని ఓశిష్య నీవు నమ్మకవుంటివి
నే ననే హంకారము పోయినా సంశయంబులు తొలగునా.
225 సంశయాదూ లన్నియు ఓశిష్య నీవల్ల సమకూడెను
వంశపావన యెప్పుడు నే ననే సంశయంబులు విడువును.
226 నే ననే హంకారము గురుదేవ మేనుండువర కుండును
ఏలాగు చనిపోవునూ తెలుపవే నాతండ్రి సద్గురువరా.
227 హంకారమందునాను గురుదేవ అఖిలప్రపంచంబును
అణిగుండు యెటు లన్నను తెలుపవే నాతండ్రి గురువరేణ్యా.
228 గాఢసుషుప్తిలోన గురుదేవ యేది అగుపడలేదయూ
హంకారమూను లేక సర్వంబు సూన్యమై తోచెనయ్యా.
229 యిక యేది కలదో అదియు గురుదేవ ఒకటయితె తెలుపుమయ్యా
సకలంబు నీవు చనగ యిక యేది కలదు అనె గురువరుడును.

## గురుశిష్యుల ఉత్తర్వులు

230 నీవు బోయిన తదుపరి ఓశిష్య నిలచెటుల గంటివయ్యా
వున్న దెటు లగుపడెనూ తెలుపరా తెలిసి జూచెద నేను.
231 నేను బోయిన వెనుకను గురుదేవ సూన్యమై వున్నదయ్యా
అంతయూ ఆలాగని అనుకున్న వాడనూ గురువరేణ్యా.

232 నీతోటి వున్న దేహ ఓశిష్య యీప్రపంచంబంతయూ
నీతోటి అణగి తేను మరల యెటుగల్గె చెప్పుమయ్యా.
233 లోతు తోచదు గురువర మొదలె ఏచుండ ననచు నేను
మీతోను చెప్పి తయ్యా వేగమే ప్రమొక్క దాని అంటిని.

## శిష్య విజ్ఞాపనం

234 మీ రగూపడ దమయ్యా గురుదేవ నే ననే **హాంకారము**
వుండునరకే నవియును అనుకున్న వాడనూ గురువరేణ్యా.
235 నేను లేనప్పుడూను గురుదేవ యేది తోచగ లేదయా
పిదప మెలుకువ జెందగా చులకనా అయినూ గురువరేణ్యా.
236 శుషుప్తి జెందివుండ గురుదేవ సూన్యమై వుండెనయ్యా
సూన్యమే కాదలెనేమొ అనుకున్న వాడనూ గురువరేణ్యా.
237 వున్న దేదియొ తెలియదు గురువర అన్న దేదియొ తెలియదు
అన్నమాటలు తోచవు నాకును నాతండ్రి గురువరేణ్యా.
238 వన్నగా గురుగు వినియూ ఓశిష్య యన్న బొద్దుండవాయదివ
కున్న బొద్దుండ కాను వున్నాడు దేవుడని నమ్మినాను
339 వున్నాడు దేవుడాని గురుదేవ అనుకున్న వాడనయ్యా
యెన్నగా దేవు నిపుడు తెలుసుకొనె తెలివి వున్నది తెలువదె.
240 లేదనే వాదంబును యెప్పుడూ చేయలేదయ్యా నేను
అనగానె సద్గురుండు దేవునీ యెటుల కనెదవు నీవ్రనూ.
241 వుండియూ కనుగొంటుదా ఓశిష్య లేకనే కనుగొనుదా
లేకపోయిన మీదనూ దేవునీ యెటుల కనెదవు చెప్పరా.
242 పోకవున్నప్పు డేను గురుదేవ ఖ్యాతిగా తెలియవలెను
ప్రాకటంబుగను మీదు మాట సత్యమే అయ్యుండును.
243 మీమాట నమ్మకాను గురుదేవ యేమాట నమ్మినాను
సద్గతీయూ తోచగనూ నాకనూ దుర్గతీ కలుగునయ్యా.
244 సద్గతీ దుర్గ తనియు ఓశిష్య యెవరు తెలిపిరి నీకనూ అనగానె
పరులు అనగా విని అన్న నాకేమి తెలియదయ్యా.

245 నాకేమి తెలియదనెవు ఓశిష్య నీకు యిది దెలుసుగదరా
మీకైతె ప్రెముక్కేశయా యిదిఒకటె తెలుసునూ శ్రీనివాస.

246 వినరోరి యిదివరకూ నాకేమి తెలియదనుచూ చెప్పియూ
యిప్పుడొకటి తెలుసుననుచూ చెప్పుట నీమాట నీతిలేదు.

247 నీవేషములు చూచితె దొంగవేషములుగా వున్నవి
నీమాటలూచు జూడ ఓశిష్య నీతిలేకుండున్నవి.

248 అప్పుడూ శిష్యుడూను దిగులుపడి భయమును జెందియు వేగమె
పాదములపై ప్రాలియు బుగులొంది భీతి జెందీ వుండెను.

249 జగములో మీతో సాటి గురుదేవ యిఘు యెవ్వరూను లేరు
నగుబాటు కాదు దేవ తమరును చెప్పినట్టుల వినియెద.

250 అని లేచి గురువునకునూ ద్వాదశ వందనంబులు జేసియు
అష్టాంగములతోడను సాష్టాంగదండములు అర్పించెను

251 నాల్గువిధంబులైన గురువుకు శుశ్రూషలును జేయుచు
స్థిరభక్తితోడుతాను తను మన దండములు అర్పించెను.

252 నేను నాదియు లేదయూ గురుదేవ సర్వమూ మీరె యనుచూ
యిఘు యేమియూ లేదయూ పామరము వీడిపోయెను గురువరా.

253 వేమూరు సర్వమంత గురుదేవ మీరెకా నెవరు లేదు
మీరు రావడ మంతకు నాతండ్రి నామోము ఫలము దేవ.

254 పాదములపై ప్రాలిన శిష్యుని గురుడు కడగంటితో చూచియు
ప్రేమతోటి గురుడును లేపియు తొడలపై నిడుకొనెను

255 హస్తంబు మస్తకమునా జేర్చియూ భూతి ఫాలము
నందున బూసియు వ్రాతి శిష్యునకును బాపెను.

256 దీక్షత్రయములు దెల్పియూ శిష్యునకు అక్షిసాజ్ఞను జేసెను
అక్షయూ మాను నీకు ఓశిష్య రక్షించి అభయ మిడితి.

257 సకలదేశములందునా ఓశిష్య సకలకాలములందునా
సకలవస్తువులందునా చంచలము లేకవున్నది చూడరా.

258 తనకు తానే నిండియు ఓశిష్య రెండవది తోపకాను
స్వతస్సిద్ధమై యెప్పుడు శబ్దసహితమై వున్నదయ్యా.

259 దృష్టాంతరముగ గురుడు శిష్యునికి దృశ్య మగుపడ జేయగా
అంతయూ శిష్యునికి అగుపడగ సంతోషమును జెందెను.

260 అంత గురుశిష్యులూను కొంతైన లేకయూను
వెలిగారమూను అగ్ని తగిలినా విధమయ్యిరీ అప్పుడు.

## చైతన్యోత్పత్తిలక్షణం

261 చైతన్యవివరమూను ఓశిష్య చెప్పెదను వినుము నీవు
మారుతవిధము నుండు తెలియరా మానితనమూ వేగమె.

262 అటుగాన చలనగుణమై వాయువు ఆవాయువూ గగనమందూ
అమరికగలై వనుచునూ పెద్దలూ అనిపల్కి పోయిరంతా.

263 ఆకాశమును శూన్యము అను ప్రసిద్ధయి వుండియు
లేనిదానిలో వాయువు పూని కల్గుట యెట్టులో.

264 పెద్దలూ చెప్పిరయ్యా ఓశిష్య సామార్థులే వారలు
లేనిదానిని కానిరి లేనిశబ్దమే వున్న దనిరి.

265 ఆకాశము శూన్యమయ్యా వుండినా శబ్దగుణ మున్నదియు గాన
ఆకాశ మనెడి పేరువచ్చె ఓశిష్య వినుము నీవు.

266 వారికీ అందినంత ఓశిష్య చెప్పిరీ పెద్దలంత
మొదలేమి లేకయూను కదలుట లేకనూ వున్నదయ్యా.

267 ఆదిమధ్యాంతమందు ఓశిష్య సూన్యమై వున్నదయ్యా
వినరాక అనగరాక సూన్యమై వున్నదీ తెలియవయ్యా.

268 సూదిమోపను సందుమూ యెక్కడా లేకుండ వున్నదయ్యా
యేదిలేకాను తనకూ తాన రెండోది లేకున్నదీ.

269 అద్వితీయం బైయ్యును ఓశిష్య అప్రమేయం బయ్యును
అచలమై నిమలమయ్యు అచలమై వున్నదీ తెలియవయ్యా.

270 ద్వయదోష రహితమయ్యి త్రయమేమి లేకుండను
నిశ్శబ్దమై యెప్పుడు నిర్గుణము వున్నదీ తెలియు నీవు.

271 ప్రతిషేమి లేనిదయ్యి ఓశిష్య బయలయ్యి కేవలాత్మ
కర్తయు భోక్తయూనూ కారణము గాంకుడ వున్నదయ్యా.

272 అవాంతరంబుగాను ఓశిష్య వింతగా ధ్వనియు కల్గె
మంతరంబున జూడగా ధ్వనియు మారుతం బాయెనయ్యా.
273 ధ్వనితోటి వాయువూను ఓశిష్య తగగల్గె చూడవయ్యా
వాయువే ధ్వనిగుణము ఆయెను చూడుమయ్యా నీవునూ.
274 యింత దృష్టాంతరమునూ ఓశిష్య యీగాలి లేనప్పుడు
పిండ బ్రహ్మాండములలో ధ్వని లేని అప్పుడూ చూడుమయ్యా.
275 తగు క్రియ యేమిలేక ఓశిష్య జడములైవుండు నిర్ధరణి అంత
శబ్దమే చైతన్యము చైతన్యమే శబ్దమని తెల్పెనూ.
276 శబ్ద మొక్కటి ఆయెను ఓశిష్య జ్ఞాత కిట్టుల కోచెను
శబ్దశ్పర్శవాంతరా లుబ్ధమై శబ్ద ముద్భవ మాయెనూ.
277 అట్టి చైతన్యమేను ఓశిష్య అగ్నినీ కల్పించియు
అగ్నిలోపల తానును ఆవేశమై వుంది తెలియవయ్యా.
278 అప్పునూ ఒప్పుగాను జేసియు ఆజలంలో తానునూ
లీనమై వుండియూను ఓశిష్య పృథివినీ కల్పించెను.
279 పూర్వమందున యేమియు లేకను యీలాగు తానె వచ్చి
పిలువనీదే వచ్చియు కానికార్యములు జేసెనయ్యా.
280 లేనివి సృష్టి జేసి ఓశిష్య తాను తన చేతనైన
లే నగ్ని జలము పృథివి వూనియు చేసెను అని తెలిపెను.
281 అన్నిటీ లోపలాను ఓశిష్య తిన్నగా తా జేరియూ
అవి నేను కాదనుచునూ యెప్పుడు అనుచుండు తెలియవయ్యా.
282 ఆరీతిగను వచ్చియూ ఓశిష్య విధము మరచియు తానును
అవాంతరంబుగాను నేను అవతరించితి అనుచును.
283 తెలియలేకను యెప్పుడూ ఓశిష్య తెలివి లేకుండగాను
బ్రహ్మయూ సృష్టించునూ విష్ణువూ రక్షించు ననిబల్కెను.
284 చంపు రుద్రుడు యనుచునూ లేనట్టి వార లున్నా రనుచును
యెంచ గేర్పాటు జేసి వారితో కల్పనా ఆయె ననెను.
285 జడరూప మైనట్టియు ఓశిష్య జనన మరణంబులూను
క్షుత్తృష్ణమదుర్మాలు యివి నాకు కలవని పలుకునయ్యా.

286 జన్మింపజేసినట్టి బ్రహ్మయును వ్రాసినది అవుతుం దని
వారి దేమియు తప్పని మరల అనుకొనుచుండునయ్యా.

287 తత్ పూర్వమున జేసిన సంచితంబే ననుకొని
తాను జేసిన కర్మము తా ననుభవించక తీరద నెను.

288 కనుక దేవుడు యేమియూ కల్పించినా డనుచును
చాలవరకును ఆర్యులు వేరె వున్నారు అనిపలుకునూ.

289 అనుకొని వారి నపుడు అతిభక్తితో జేరియు
నాల్గుశుశ్రూషలూను నయముగా జేయుచూ నుండె నపుడు.

290 సాధనంబులు నాలుగు సాధించి వందనాల్ పదిరెండును
వరుసతోడుత జేసియూ శిష్యుడూ వాసిగా తా నిలచెను.

291 తను మన ప్రాణములను గురునకు అర్పితంబును జేసియు
వినుతుల తోడ గురుని ప్రణుతియు జేసియూ నిలచె నపుడూ.

292 నిలిచున్న శిష్యు నపుడు తా జూచి నిరుపమానందు డపుడు
కరుణ జూచెను బాగుగా దుష్కర్మ మణచి పరమును జూపెను.

293 వెరవాకు యఘములూను ఓశిష్య దురములూ పోవు ననుచూ
స్థిరబుద్ధితోడు తాను చంచలా హరుడైన వాణ్ణి చూపె.

294 శిష్యోత్తమా నీకను ఒకమాట చెప్పెదా వినుము నీవు
అల్పగుణముల బాసియు చెప్పిన రీతిగా వినుము నీవు.

295 పృథివి ఆప స్తేజము ఓశిష్య వాయువు ఆకాశము
యివి పంచభూతములు కల్గెను యిక గలవు చెప్పెదాను.

296 జ్ఞానకర్మేంద్రియములుపదియు అంతరేంద్రియశబ్దాదులూపది
యును, ప్రాణముల్ అయిదు గలసి పరగ పంచకామాయనయ్యా

297 యిందులోనా నీవునూ ఓశిష్య మించి నుండగ నాయెను
వంచనా మాయతోడ చేరుకొని సంచిత జ్ఞానివే నీవయితివి.

298 యిన్నిటికినీ మీరియూ ఓశిష్య నున్నట్టివాడవయ్యె
దేహేంద్రియములు నేను అనుకొన్న జీవుండ వయితివయ్యా.

299 కావు నీ విందులోన ఓశిష్య యేదియును గాదు నీవు
నీ నిజా రూపంబునూ తెలిపెదా నిజముగా కను మనియెను.

300 నాటినుం చిది నీవునూ ఓశిష్య సూటి దెలియక లేకనూ
చేటులొందుచు నుంటివి యిప్పుడు సూటి తెలియుము అంటిని.

301 మేటి వయ్యేవు తెల్వితేటచే చూచినాను
వాటమూగాను యెపుడు సంశయ బాట బాసిన యపుడు.

302 అని చెప్పగా వినియును శిష్యుడు అత్యంత దీనుడయ్యి
మతి కరుగుచూ నప్పుడు చలనగతుడు నగుచూ నిలిచెను.

303 నాజన్మ మీడేరెను గురునాథ నాకర్మములు దొలగెను
సంసార మిఘు యేలను చాలునూ అని శిష్యుడూ పలికెను.

304 గురువుకన్నను పరమును వేరుగా లేదని యెపుడు తాను
శక్తివంచన లేకనూ గురునకు శేవ జేయుచు నుండెను.

305 ప్రణుతులూ జేయసాగె గురునకు ప్రాదక్షిణము జేయుచు
వినుతు లొనరించసాగె గురునకు శేవ జేయూచుండెను.

306 ఘనమయిన గురుడు జూచి అప్పుడు మనమునా సంతసించె
పని కల్గెనూ ననుచును శిష్యుని వినుమనీ తెల్పబూనె.

307 సచ్చిదానందమూను ఓశిష్య స్వప్రకాశము నీవును
సాక్షివీ నీ వైతివీ లోకాక్షివీ నీవెనయ్యా.

308 చైతన్యమును నీవునూ ఓశిష్య క్షేత్రజ్ఞుడవు నీవెను
దేవుండవూను నీవె యనుచును తెలిపెనూ గురువరుండు.

309 చతురాగ్రమునంమున నిక్షేపముగ వెలుగుచున్న
సూక్ష్మ తేజంబు అపుడు గురుడును సూటిపరచెను వేగమె.

310 బ్రహ్మవిష్ణీశ్వరులును ఓశిష్య భావంబులును నీవెనూ, నమ్మి
యుండుము తెలిపెదా నిష్కళాయందున కమ్మియుండెడిచూపెదా.

311 నిమ్మళంబుగను పంచ ఓశిష్య శక్త్యాది వర్ణమూలు, సమ్మతీ
గాను గంగ యమున సరస్వతీనదులు నమ్మియుండుము తెల్పెదా.

312 పంచభూతంబులూను ఓశిష్య పంచవర్ణంబులూను
పంచశక్తులు సప్త సాగరములూ అన్నియూ.

313 పిండ బ్రహ్మాండమూలు ఓశిష్య మండలాత్రయములూను
త్రిగుణగుణంబులూను త్రిపుటిద్రిపుటులు అన్నియు.

314 సకలదృశ్యము లన్నియూ ఓశిష్య కళాసాన్నిధ్యమే వుండును
ఒకటి లేకను సర్వము నీయందు నిండుండు తెలియవయ్యా.
315 సర్వమందున నిండియూ ఓశిష్య నున్నట్టి వాడవయ్యా
నిర్మలం చైతన్యుండియు వున్నట్టివాడవూ తెలియవయ్యా.
316 సర్వము నీవె కాని ఓశిష్య నీవె సర్వంబనుచును
నిర్మల మైనట్టియు ధర్మస్వరూపుడవు నీవెనూ

## ప్రజ్ఞాన వ్యాఖ్య వివరం

317 జ్ఞానేంద్రియ బులాచె ఓశిష్య కర్తై విషయంబులాను
యేజ్ఞానమూను అయితే గ్రహించుచుండెనో అజ్ఞానము.
318 కర్మేంద్రియ బులాచె ఓశిష్య కడు ప్రాణవిషయములచే
అమరి అనుభవమూలను అనుభవించేది యేది కలదో.
319 అంతరేంద్రీయంబులాచె ఓశిష్య అంతఃకరణావృత్తిచే
విషయముల్ అన్నియూను పొసగ గ్రోలేటి దానినయ్యా.
320 పంచవిశంతిని నెరిగి ఓశిష్య ప్రజ్ఞ యేదియు కలదో
అదియె ప్రజ్ఞానమూని బుధవరులు ముదమైన బ్రహ్మ మనిరి.
321 విదితంబుగాను స్మృతులు ఓశిష్య వివరింపుచున్న విటుల
మదిలో రక్షార్థ మెరుగ నది ముఖ్యబ్రహ్మమూని పలికిరీ.
322 హరి హర బ్రహ్మాదులు ఓశిష్య సుర లింద్ర సనకాదులు
మునులు వ్యాసాదులూను ముఖ్యులైనవారలు అందరు.
323 గరుడ గంధర్వులూను ఓశిష్య ఘనయక్ష రాక్షసులును
కిన్నర కింపురుషులు ఓశిష్య పన్నగములూ అందరు.
324 వర శిద్ధ సాధ్యులూను ఓశిష్య నరమృగ పశు పక్షియు
క్రిమి కీటక సర్వాండములు ఓశిష్య సర్వజీవులయందునా.
325 సాన్నిధ్యమై వున్న ఓశిష్య శుద్ధచైతన్యము
సుగుణాత్మ ఒక్కటేను ముద్దుగా వున్నది తెలియవయ్యా.
326 వద్దికా లక్ష్యార్థము ఓశిష్య వరా అనుభవము యిదియే
సద్దుచేయక చూడుము సర్వము నిండియున్నది తెలియుము.

327 సుర నరాది గజాశ్వ ఓశిష్య క్రిమికోటి అండములునూ
వాచ్యార్థములను చూడ వరుసగా వుండునూ తెలియవయ్యా.

328 వాచ్యార్థములు అన్నియూ ఓశిష్య వరుసగా వీడితేను
లక్ష్యార్థమే వుండును ఓశిష్య రాజితముగా అప్పుడు.

329 అట్టి లక్ష్యార్థమునకు ఓశిష్య ప్రజ్ఞాన మని బ్రహ్మ మనియు
పలుకబడెను వాటికే యిక పేర్లు గలవయ్యా చెప్పెదాను.

330 అపరబ్రహ్మమునకే ఓశిష్య ఆత్మని చైతన్య మనియు
అర్థభేదము లాయెను వస్తువ ఒకటనీ తెలియవలెను.

331 ఆరీతిగా ఋగ్వేదము ఓశిష్య అర్థము అయ్యి వుండు
సార్థకసార మిదియె అర్థసారాంశమూ తెలియరా.

## అహం బ్రహ్మాస్మి వ్యాఖ్య వివరం

332 అహ మని బ్రహ్మ మనియు ఓశిష్య అస్మినే వాక్యమునకు
అర్థంబు తెలిపెదాను వేగమే వినవయ్యా విశదముగను.

333 దేహేంద్రియప్రాణముల్ ఓశిష్య ధీమనోంకారమూలు
అవి జడములు వీటికీ వాచ్యార్థ మగుచుండు తెలియవయ్యా.

334 అహం పదమునకు అవియు ఓశిష్య వాచ్యార్థ మైయుండును
పరిపూర్ణముగను నుండును బ్రహ్మపదమునూ తెలియవయ్యా.

335 బుద్ధికీ సాక్షి యయ్యు ఓశిష్య స్ఫురియించి వెలిగేటిది
పూర్ణ బ్రహ్మమె అహమునకు లక్ష్యార్థ మైవుండు తెలియవయ్యా.

336 వర్ణింపరాక లోన ఓశిష్య బహిర్ వ్యాపక మయ్యును
పూర్ణాత్మ లక్ష్యార్థము భువనబ్రహ్మండ వాచ్యమూను.

337 అహం పదవాచ్యమూను ఓశిష్య బ్రహ్మవాచ్యంబులూను
దేహబ్రహ్మండముల ఓశిష్య త్రోసివేయుము రెంటిని.

338 వుత్తమలక్ష్యార్థములూ ఓశిష్య పై రెండు జేర్చితేను
అస్మి ధనే పదమునాకు అర్థము నయ్యుండు తెలియవయ్యా.

339 బ్రహ్మ తను నేకమైతి నని తెలుసుకొనుటకేనాయె వాక్యం బిదీ
వేద మట్టుల బల్కుటను ఆయజుర్వేద భేధ మట్టుల ఆయెను.

340 వాదములన్ని మాని ఓశిష్య నాదు లయమూ జేసియు
బేధము లేమి లేక కీలు తానై నిలచెను

తత్వమసి వాక్య వివరము

341 తత్వదాత్వం పదాము ఓశిష్య అసి పదావాక్యంబుకు
తాత్పర్య మెరిగించెద స్థిరబుద్ధితోడను తెలియు మనెను.
342 సర్వంబునందు యొప్పుకు ఓశిష్య సాక్షి వ్యాపక మయ్యును
సర్వసమష్టియేను తత్పదము అనుమాట అర్థమయ్యా.
343 తత్పదము నాకేను ఓశిష్య తగను లక్ష్యార్థంబును
సృష్టికి పూర్వంబును నైజన లేకనె వున్నదయ్యా.
344 యేకమయినా బ్రహ్మము ఓశిష్య తత్పదంబుకను
యి యె లక్ష్యార్థమయ్యె స్థిరముగా మదిలోన తెలియవలెను.
345 జోకలేకాను శిష్య వేగమే త్వం పదార్థము తెలియుము
పాకారి ప్రముఖు లంత ప్రస్తుతించేటి విధము యిదియె.
346 మూడు దేహంబులూను ఓశిష్య మూడవస్తలు పొందుచు
మువ్వురభిమానులాతో ఓశిష్య మూడు క్రియలను పొందును.
347 కూడి అందులో చేరియు ఓశిష్య బింబించినా దేవుడె
త్వం పదా వాచ్యమగును చెప్పితి మదిలోన తెలియవయ్యా.
348 దేహత్రయావస్తలు కోశంబు లంటకాను వున్నదే
సచ్చిదానంద మైన కూటస్థచైతన్యమే బ్రహ్మము.
349 తత్పదా త్వం పదములయీ రెండు లక్ష్యార్థములు గలయనూ
ఆసిపద మైక్యంబును ఓశిష్య వేగమే తెలియుమయ్యా.
350 పొసగ వాచ్యార్థములును పోలుపొంద జీవేశ్వరులును
యశమైన ప్రత్యగాత్మ పరమలక్ష్యార్థ మైవుండును.

అయ మాత్మ వివరం

351 అయ మని ఆత్మనీయు ఓశిష్య ఆపరబ్రహ్మ మనియు, అయ
మాత్మ బ్రహ్మం బనెపదమునూ తెలిపెదను తెలియుమయ్యా.
352 స్వప్రకాశ పరోక్ష ఓశిష్య చైతన్యభావమేను
అయ మనే అర్థంబును మనసులో తెలియవలెనూ యిప్పుడు

353 [illegible]లాను ఓశిష్య జడమైన హంకారము
[illegible] ప్రత్యగాత్మ ఆప్రత్యగాత్మనే ఆత్మ యనాను.

354 [illegible]మంత బ్రహ్మాండ మాది సర్వ మయేదంతయు
[illegible] నుండెడి శాశ్వత స్వప్రకాశము ఒక్కటీ.

355 [illegible]ముగ వెలిగెటి బ్రహ్మపదార్థ మైయ్యుండును
[illegible] వివరమూను మనసునా మరునగా రానిదయ్యా.

356 ప్రజ్ఞానబ్రహ్మంబును ఓశిష్య సాజ్ఞ నెరిగించితయ్య
అయ మాత్మ బ్రహ్మ మనె ఓశిష్య అనుభవంబును తెలిసితి.

357 అహం బ్రహ్మస్మియు అది లెస్స నెరిగించితీ నీకును
తత్వమస్మను వాక్యము సరళియూ దెలిపితీనయ్య యిపుడు.

358 బ్రహ్మమే నీవనియును ఓశిష్య నీవె బ్రహ్మ బనియును
బోధించితి నాలుగు పామగా యీమంత్ర మిదునబోకు.

359 యింతకంటెను యెక్కువ లేదని చింత మానుము యెప్పుడు
యెంతో భయమూను జెప్పియేమియు లేదనుచు తెలిపె నపుడు.

సీసార్థ దరువులు

కవి వంశానుక్రమము

360 శ్రీకరంబుగను శుభ శేఖరంబై
యున్న కరణము రంగారావు వంశోద్భవుండు
పరమపవిత్రుండు కరణము తిమ్మప్ప
అలర పేరు జనకుండు నాకును
జనని నరసమాంబ అల శీతమాంబసతి
అవనిలోన భాగవతోత్తమ నుత భావయుక్తుడ ॥దర్వు॥
శివరామదాసాని అందురూ పామారజనులూ
నామరూపాములా కందురూ ప్రేమతో గురుసీ
బోధా నేమాము గనియూ వేగా
పామార మార్గమూలా సారాము వదులానాయె ॥శి॥

361 విక్రమార్క శకంబు వినుము రెండు
వేలపదునాలుగు ప్రాకటముగ
శాలివాహనశకం దగను
పద్దెనిమిదినూర్ల యనబై గడువనాయె
కలిగతాబ్దంబును పంచసహస్ర వత్సరములు
యాభై తొమ్మిది పదున నైన వినుము
విళంబినామ సంవత్సరంబున ॥దర్వా॥
మార్గశిర శుద్ధమందున సౌమ్యవాసరమునా
మిత్రాస్తమానమునా శ్రోత్రీయులాకు
మేలుసూత్రాము దెలియుకొరకు
ధాత్రిలో పలుకనాయె తలచా దేవునీ కృపతో ॥మా॥

## గ్రంథకర్త ఆశీర్వచనము

362 గురుమహిమ యెందాక కూడి వర్తించునో
అందాక యీబోధ అధిగమించు
వసుధా జలం బగ్ని వాయు వాకాశముల్
యెందాక నుండునో అంతవరకు
యెందాక రవి శశి తారాంబుధు లుండునో
నందాక యీబోధ అతిశయిల్లు
వర్ధిల్లుచుండును వసుధపై దీనిని ॥దర్వా॥
ఆర్యాలా కెల్ల మ్రొక్కియూ అర్పించితి రశికా
వర్యాలా కేనూ దక్కియూ వారిలో
వేసినాను వసుధాలో యెంచకున్న మీరీ
వర్ధిల్లుచుండూ ధీరా మాగు గురునీ కృపతో ॥ఆ॥

## మంగళము

363 జయజయ నిశ్శబ్ద జయజయ మనిర్వాచ్య
జయము నిరాకార బయలునకును
జయ నాత్మ నాత్మలాత్పర కేవలాత్మకు
జయమచలాత్మకు జయము జయము

జయ నిర్వికారమునకు జయ నిర్మలాత్మునకు
జయ జయ మవికల్పనిమలమునకు
జయజయ మమలాత్మ జయ నిశ్చలాత్మునకు ॥దర్వ॥
అవ్యాయ మైన పదవికి ఆది
అనాది సర్వ్యమయ్యైన పదవికి
అవ్యాయ పదమునాకు అదిజయమునుంటుగాక
భవపాశరహితా మైన అపకాశమూనకు జయము ॥ అ ॥

గద్య॥ ఇతి శ్రీమ ద్వేదాంతసారుండును సచ్చిదానందతీతుండును క్షేత్ర
క్షేత్రజ్ఞ రహితుండును క్షురాశిరోపాది విలక్షణుండును ప్రకృతి
పురుషద్వయదోష రహితుండును పరమపవిత్రుండును అశరీరుం
డును అప్రమేయుండును అచలుండు నయిన శ్రీమత్ అన్న
మరాజ భారద్వాజసగోత్ర పవిత్రుండు నయిన సుగుణా
కర స్వామి దేశికేంద్ర జగురుచరణకమల కురు
విందారువింద మరందపాన తుందిలతా మంద
మందానంద మిళిందబృందంబున శ్రీమదా
ర్వేలస యోగి రంగరావుశర్మ సంశో
ధ్భవ కౌండిన్యసగోత్ర పరమపవి
త్రుండు నయిన ఉప్పలధడ శివ
రామదాసుచే రచించబడిన
శ్రీనివాస గురుశిష్యాను
వాద తరంగము అను
గ్రంథము సర్వము
సంపూర్ణము

—

యమపురి వలలో బడుతుంది ॥కా॥ పట్టుదలతో గురువును వెతకి సేవా జేయమంటేను - యిట్టిమాట లన్ని నాకు పట్టుబడవు అంటుందీ ॥కా॥ ధరణిలో శివరామదాసుని మాటలు చెవుల వినుమంటె - పరిపరివిధముల చింతన జేయక పనికిరావు అంటుందీ ॥కా॥

**19** రాగం నాదనామక్రియ ఆట తాళం

జీవుడే నిజముగ దేవుడే సద్గురుని జేరితె జీవుడే నిజముగ దేవుడే - జీవుడు దేవుడను అద్వైభావమూను దెలసి నిస్సందియంబుగ నన్న వాడు ॥జీ॥ పంచతత్వము లన్ని తరచి సంచితాదు లన్ని బాసి - వంచనా జేయక సద్గురు సేవ జేయుచున్నవాడు ॥జీ॥ అష్టమదముల అణచివేసి సప్తవ్యసనము లన్ని రోసి - కష్టసుఖములు లేని పరమ పదవినీ జెందినవాడు ॥జీ॥ మూడుగుణముల మూల మెరిగి ఆరుగుణముల అంటు బాసి - అంత్యమేడలో నిలచినట్టి బాల గుట్టు దెలసుకుంటె ॥జీ॥ మేటిశిఖరము పైన వెలిగె జ్యోతిరూపము గనియు తాను - సూటి దప్పక నిలచియును పరబాటను కన్నట్టివాడు ॥జీ॥ ధరణిలో వెలివేర్తి రామగురుని బోధను మదిని తరచియు-స్థిరముగా బయలందు మనసును నిలిపినవాడు అపుడె ॥జీ॥

---

శ్రీ గురుపరబ్రహ్మణే నమః

# సుగుణాకర దేశికేంద్ర శతకము

1 శ్రీగురుండు నయిన చిన్మయాతీతుని చేరుకొరకు నీదు సేవ జేసి
పరమభక్తుల నిల ప్రణుతించి వేగమె నన్ను బ్రోవుమంటి నిన్ను నిపుడె

2 శ్రీగురుదేవా నన్ననురాగముతో బ్రోచియును జరామరణములన్
వేగమె పోదోలుము నిక బాగుగ నీపదయుగళము ప్రణుతింతునుదినన్.

## గ్రంథకర్త అభిప్రాయము

3 సకలశాస్త్రంబుల సకలార్థముల నెల్ల చదివి శేయగ లేను సభినయ
ముగ నీకృపచే కల్గె యీవాక్కు- లన్నియు నన్ను గన్నతండ్రి
గురువరేణ్యా.

4 యతి గణ ప్రాసం బెరుగను మతిలోపల గురునిసేవ మానక
జేతున్, యతి గణ ప్రాసము యిదియే సతతము నన్నేలవయ్యా
సద్గురుచంద్రా.

5 కావ్యము లెరుగక పద్యము లెందుకు సేసితి వటంచు యిల జను
లనిరీ, సందేహింపక చేసితి యిందులో తప్పున్న మీరు దిద్దెద
రనుచున్.

## సుజన లక్షణం

6 జనని జనకులు నెల్ల తనయుల తప్పులు తలచని విధమున తత్వ
విదులు, తప్పులు సవరించి పద్యముల్ చదివియు రుచి గలుగ
జేతురు గురువరేణ్యా.

## దుర్జన లక్షణం

7 తత్వహింసలు గ్రంథసారంబు దెలియక తర్కించుచుందురు తప్పు
వెతకి, యిలలోన జనులకు విసుగు పుట్టించియు వినకుండ జేతురు
గురువరేణ్యా.

8 లేనికలలో ముందు లేకనే కల్గియు నీదు సత్కృపచేత గుట్టు
దెలసి, నిన్ను భజియించెద నిత్యంబు నామదిన నన్ను కావుమయ్యా
గురువరేణ్యా.

9 నమ్మితి నీదగు పదముల సమ్మతితోడుతను నాదు స్వాంతము నందున్, మమ్ముల బ్రోవుము ధీరా ఇమ్మహి సుగుణాకరాఖ్య హితసామ్రాజ్యా.

10 తెలవారెను యిక జన్మము కలయయ్యె జగంబు లెల్ల కనుగొను చుండన్, యిలలోపలనీకృపచే సలలితముగ బ్రతికినాడ సద్గురుచంద్రా

11 పుట్టితి పుష్పలధడలో పుట్టితి వెలివేర్తిన తమ పదపద్మములన్ గట్టిగ గొలచిన వాడను వట్టిది జగమనుచు దెలిసె వాంఛలు ధీరన్.

12 మును జన్మఫలమెగద నా జననమునకు మూల మయ్యె చాలింపు మయా, నిను గొనియాడెద నీ నందనుడను నను మఱవకయ్యా తాపసవర్యా.

13 ఎపుడు నీదు కరుణ యేమారబోకను తప్పు లొప్పులనుచు దలపు మయ్యా, తరచి చూడగ లేను తత్వంబు దెలుపుము దీనజన శరణ్యా దిక్కు నీవె.

14 గురుపర నీ నా సందున యెరుకనె తెర గలిగియుండె యింతవరకునా యెరుకను విడిపింపుము నీమరుగున నను జేర్చుకొనుము మాన్యసుగేయా.

15 మ్రొక్కితి నీ చరణములకును దక్కితి నీ భావమునకు దయజూడు నికన్, చిక్కుల పెట్టకు సన్నిఘ చక్కగ పాలించుమయ్యా సద్గురుచంద్రా.

16 మూడుకాలములందు మూడవస్థలయందు వేమక దుఃఖముల్ కల్గునపుడు, జోడు బాయక యెపుడు నన్ను కడ తేర్పను వుండు మయ్యా నీవు గురువరేణ్యా.

17 పద్మనాభ యట్టి పరమాత్మ నెప్పుడు యెరుగుటకును యెపుడు కలియుటకును, నీదు కృపచే కల్గె యిట్టిపదవిని జెంది సంశయ ములు బాసె గురువరేణ్యా.

18 నిండితివి చరాచరములు దండిగ దశదిశలయందు నిజముగ గురువే ఖండాఖండము లొందక యెందున చూచినను నీవె సద్గురుచంద్రా.

19 నన్ను పుట్టించుట నిన్ను నేనుగనుట చిన్నెలన్ని బాపి చింతదీర్చి వున్న నిజమును దెలిపి వుత్తమపదవిని చెందజేసితివయ్యా గురువరేణ్యా.

20 యెంతనిపోగ డెద నిన్ని ఘుఅంతరమునమనసుకే మొఅందకపోయెని
అంతయు నీవే అయితివి సంతసమున నన్ను కావు సద్గురుచంద్రా

21 లేనిది యెరుకను లేదని మూనసమున దృఢము జేసి మక్షువతోడక
రానిది పోనిది బయ లని భావంబున నిలిపితివి సద్గురుచంద్రా.

22 నేను నిన్ను గనుట నీవు నన్ను గాంచుట నీవు జెప్పుటయుని
నేను వినుట, అన్ని మాయ యనుచు వున్న నిజమును దెలు
చింతలన్ని బాసె గురువరేణ్యా.

23 నిన్ను వర్ణించను నిఖిలవేదము లన్ని చాల వనుచు శృతుల
సన్నుతింప. నేను యెంతటివాడ నిన్ను వర్ణింపను నన్ను గన
తండ్రి గురువరేణ్యా.

24 చుట్టు తెరలోన తా నుండి సూత్రములను బట్టి బొమ్మ లాడించి
వానిమాడ్కి, మాయచాటున జేరి మగుకి బొమ్మల బట్టి నాట
ములను జరుపుచుందువయ్యా.

25 బొమ్మ లాడుచున్న పోల్కిగా గనుపించు నీవులేక బొమ్మ లా
గలవ, ఆడుమేరిబొమ్మ అందుకు యిలలోన నిన్ను గానలే
గురువరేణ్యా.

26 ఇల్లువాకిలి వాడి ఇల్లాలు నా దనుచు యెల్లకాలము నేను యు
మందు, తలచి తలచి నేను తల్లటించియు తుదకు నిన్ను జేరి
నయ్యా గురువరేణ్యా.

27 తామ్ర మృణ్మయంబు దారు శిలల కెల్ల పూజ సేసితినయ్యా బ
మాలి, యెదటవున్న నిజము గానక యెప్పుడు యెంత మో
పోతి గురువరేణ్యా.

28 గోవిందుని చరణములను నా హృదయమునందు నిల్పి నమ్మి
నయ్యా, కాపను వేగమె రావే జాగును శేయంగబోకు సద్గు
చంద్రా.

29 పావన మైనట్టి నీదుచరితంబును ఆడుచు పాడుచు నుండుటకున
మానసంబున యెపుడు మరువక నిలచియు న న్నాదరించ
గురువరేణ్యా.

30 యేవారమయిన నీవే మీవారము యనుచు మదిలో నిన్నే దలతున్
మావారు నేను మీలో పోవారము దేశికేంద్ర సద్గురుచంద్రా.

31 నీ కథలు మెపుడు వినియెద నీ కీర్తన స్మరణ జేతు నిన్నే తలతున్
ఏకస్వరూపుడ నీ కృప చేకొంకును దేశికేంద్ర సద్గురుచంద్రా.

32 వందనము దాససేవయు అందం బగు చరణములకు అర్చన ఆత్మా
వింకును జేసెద గైకొను సుంకరముగ దేశికేంద్ర సద్గురుచంద్రా.

33 హరిహర అజ యింద్రాదులు సుర నర సనకాది యోగ సిద్ధ
మునీంద్రుల్, నీవే నధికం బనుచును స్మరియింతురు దేశికేంద్ర
సద్గురుచంద్రా.

34 కరుణారస నిజగురుపద స్మరణంబును హృదయకమల మధ్యము
నందున్, మరినిలిపి దలతునయ్యా పరుసగు ని న్నెపుడు నేను
సద్గురుచంద్రా.

25 భక్తపాల పరాత్పర భక్తుల రక్షించుమయ్య భక్తప్రియుడా
ముక్తిప్రదాతవు నీవె భక్తాత్మక దేశికేంద్ర సద్గురుచంద్రా.

36 హృదయపద్మమున వుండిన పీడని చండాలు లిరువురి లోదలగ
గొట్టెన్, పీడక గూర్చుంచుమి యిక మది మరువను దేశికేంద్ర
సద్గురుచంద్రా.

37 సర్వభూతుండ వనియుచు సుర నర ఘనయోగులు కని గ్రంథ
కల్పన జేయన్; గురునిచేతనె కనుగొని చనిపోయెను దేశికేంద్ర
సద్గురుచంద్రా.

38 యేరూపము చూచిన నిక నీరూపము ఒక్కటుండు యెందున
నైనన్, ఆరూపమంకుఅణగునునారూపము దేశికేంద్రసద్గురుచంద్రా.

39 ద్వాదశవత్సరములు గడచెను ద్వాదశ దళమందు యెపుడు అర్చ
నములునీ, మది మరువ కెపుడు జేసెద నను మరువకు దేశికేంద్ర
సద్గురుచంద్రా.

40 మాత పితృ హితాదులు నీవే ధాతయు గురు దైవ బంధు
భ్రాతయు నీవే, ప్రీతిగ సతి పతి సుతుడవు ఖ్యాతిగ అన్నియును
నీవె సద్గురుచంద్రా.

41 ధరలో నీవలె దాతలు మరియెవ్వరు లేరు యనుచు తలచుచునుం
డగా, మరి కల్గబోరు యెవ్వరు స్థిరవచనము దేశికేంద్రసద్గురుచంద్రా.

42 యెంద రున్ననుగాని యేమి ఫలములేదు అందరు నీ సమము రారు
అది యెట్లనినగా, ముందే నను పాలింతురు సందేహము లన్ని
బాసె సద్గురుచంద్రా.

43 నీపలుకులె ఆనందము నీపలుకులె భజన జేతు యెప్పటికైనగా
తాపము చేయక వచ్చియు కాపాడవె దేశికేంద్ర సద్గురుచంద్రా.

44 ఒక్క పసిడి పెక్కు నగ లొప్పు చందమున ఒక్కడవైన నీవు
అనేకముగా తోచి, యెన్నొ ఆత్మల భవముగా చీకాకు జెంది
నీలో చేకొందువు దేసికేంద్ర సద్గురుచంద్రా.

45 ఆత్మనాత్మల గైకొని ఆత్మాత్మల నంటకుండి అమలపదంబై
సూత్రమె పరమై నిలచిన చిత్రంబువు దేశికేంద్ర సద్గురుచంద్రా.

46 యేస్థలమందు జూచిన ఆస్థలమే స్థావరంబు అంతయు నీవై
నాస్థానమందు స్థానము చేస్తివికద దేశికేంద్ర సద్గురుచంద్రా.

47 ఒకదినము గురువరుండును అకలంకము విమలమందు అణిగుం
డంగా, సుకృతంబున ఒకనరుడును యిక ప్రమొక్కెను దేశికేంద్ర
సద్గురుచంద్రా.

48 తారకసాంఖ్యమనస్కము సారంబును దెలిసి యెరుకజోలిని విడకా
పారంబు గానలేకను చేరెదు మిము దేశికేంద్ర సద్గురుచంద్రా.

49 ద్వాదశదండంబులు యిక భేదంబును లేక జేసి మొర లిడుచుం
డెగా, వాదంబు లేని అచలము బోధించెను దేశికేంద్ర సద్గురుచంద్రా.

50 వినరానిజమును దెల్పెద కనరాకనుపుండు అచలపదవియగను మీా
కనుపడెడు దృశ్యమంతయు చనవలెనని దేశికేంద్ర సద్గురుచంద్రా.

51 అచలము మొదలెరిగించియు సచలంబును లేనిదనుచు చయ్యన
దెల్పి, సచలంబును కడ ద్రోయుము పసియించెను దేశికేంద్ర
సద్గురుచంద్రా.

52 యోగంబు లెన్ని జేసిన ఆగంబే అనుచు గురుడు అమలము దెల్పి
బాగుగ అమలములోకలైను శ్రీగురుడును దేశికేంద్ర సద్గురుచంద్రా.

53 పుట్టదు గిట్టదు అచలము పుట్టించదు చంపజోదు దిట్టంబై
కన్పట్టమిలేక యింతట పట్టయినది దేశికేంద్ర సద్గురుచంద్రా.

54 యింపున సంపున అన్నిట ఖండంబై పున్నయెరుక సత్యం బగునా
యొంపునచూచిన అన్నిటనిండియు సందిడనిది దేశికేంద్రసద్గురుచంద్రా.

55 యెప్పుడు కనపడ చుండియు చప్పుడు లేకుండవుండు సరళియు
బయలే, యిప్పుడు అప్పుడు అనక యెప్పటికి కదె దేశికేంద్ర
సద్గురుచంద్రా.

56 భావింపరాని బయలును భావించెద మందు రెట్లు భావాతీతం
భావింపరాని మార్గము భావించిన దేశికేంద్ర సద్గురుచంద్రా.

57 పంచభూతముల చేరియు పంచాత్మక మైనదే యీజగంబు
లయ్యెన్, పంచభూత వికారము లేని అచలము నశింపగ రాని
దయ్యె సద్గురుచంద్రా.

58 అంతిం తని అనరాకను చింతలు యేమియును లేక అమలపదంబై
చింతలు నన్నని చేయక రంతుడిగిన దేశికేంద్ర సద్గురుచంద్రా.

59 ధర విత్తుచెట్టు విధమును సరవిగ జలజంతువులను సలిలము
కనునా, అరలేని అచల మెరుకను యెరుగనుకద దేశికేంద్ర
సద్గురుచంద్రా.

60 ఆకాశ మొకటె నంటక ఏకముగా సర్వమందు వ్యాపక మొందున్
యీకలలో బయలునిండియు ఒకదానిని నంటకుండుసద్గురుచంద్రా.

61 యెరుక పుట్టుక తెలియును పారిహారిబ్రహ్మాదు లయిన తరమా
యెరుగన్, నరు డెంతవాడు అది గన గురుకృపచే దేశికేంద్ర
సద్గురుచంద్రా.

62 వృత్త త్రాటందు సర్పము భ్రాంతిచె తోపించురీతి అత్తరి నేనున్
వృత్తమగు అమలమందున వస్తిని అటు దేశికేంద్ర సద్గురుచంద్రా.

63 నే నెటుల కల్గి తనగను మానుగ జలమందు కల్గు బుగ్గల రీతిన్
మినుగురుపుర్వులవలెనే చను డెంతును దేశికేంద్ర సద్గురుచంద్రా.

64 కట్టెందు నిప్పు లేకనె కట్టెతోనొక కట్టె చేరి వరయుటచేతన్
మట్టుబడి మెరుపుకై వడి పుట్టును నటు దేశికేంద్ర సద్గురుచంద్రా.

5 స్థాణువునందున పురుషుడు లేనటువలె నచలమందు లేకనె తోచుగా
లేనిది యిటువలె కనపడు మానుగ గురుదేశికేంద్ర సద్గురుచంద్రా.

6 యెరుకే జగముకు మూలము యెరుకకు మూలంబు జగము
యీరొండొకటై, కార్యాకార్యము లన్నియు జరుపునుగద దేశి
కేంద్ర సద్గురుచంద్రా.

7 తేజమనె మాయ నొక్కటి సహజంబుగ కల్గె నాదు తోయము
నందుగా, తేజంబె తత్వ మనెదను రాజుండెద దేశికేంద్ర సద్గురు
చంద్రా.

8 పిలువని పేరంటంబున తులువతనంబున నాకు నేనే వత్తుగా
కలలోన కల్ప నన్నియు ములుః జేయుదు దేశికేంద్ర సద్గురుచంద్రా

9 నేనే పుట్టెద చచ్చెద నేనే సృష్టించెదాను ఓర్పుతో పెంతుగా
నేనే చంపెద చచ్చెద నేనే కద దేశికేంద్ర సద్గురుచంద్రా.

0 క్షణములో ఒకవిధ మయ్యెద క్షణములోనే వచ్చిపోదు వింతలు
జేతుగా, క్షణములో నీలో జేర్చియు కరుణించవె దేశికేంద్ర
సద్గురుచంద్రా.

1 కట్టెను దేవుండనియెద ఘుట్టిగ వక రాయి దెచ్చి ప్రతిమను జేతుగా
యిటువలె యెన్నో మాయలు తటుకున చేసెదను నేను సద్గురుచంద్రా

2 జాతరలను సాగించెద ప్రీతితో జనులొచ్చెయుక్తి ఖ్యాతిగ జేతుగా
యీతీరు చేయ నెప్పుడు కర్తవ్యము దేశికేంద్ర సద్గురుచంద్రా.

3 నాదము బిందులో కల్గెను నాదముచే బిందు వనుచు నామం
బాయెగా, బిందువు నాదము నందున పొందును మరి దేశికేంద్ర
సద్గురుచంద్రా.

4 యెప్పటికి వున్న బయలులో చప్పుడుతో వుండి దాని జాడను
కనిరగా, యెప్పటి కున్నదె వుండును చప్పుడు చని దేశికేంద్ర
సద్గురుచంద్రా.

5 జాలము యింద్రమహేంద్రము జాలము జగత్స్వప్నమిథ్య జాల
ములకీ, చాలగ బయలై అంతట మేలుండును దేశికేంద్ర సద్గురు
చంద్రా.

76 కన్నది విన్నది అన్నది సున్నా యనుచూచె మెరుక సూన్యం బాయగ, వున్నది వున్నట్టాయను యెన్నికతో దేసికేంద్ర సద్గురు చంద్రా.

77 గురువరు నామాంకితముగ గురుపుత్రులు గూంథపథము గుర్తెరు గుటకై, కరుణ రచించితి చరణము కర్పించితి దేశికేంద్ర సద్గురు చంద్రా.

78 వ్రాసియు చదివియు విన్నను వాసవపుర మేగెదారు వైభవ మమరగ, జూచి పతి యుంచేవారికి మోసంబిడు దేశికేంద్ర సద్గురు చంద్రా.

79 మంగళము అచలమూర్తికి మంగళమును అంగలింగభంగ బయలు నకుగ, మంగళము కేవలాత్మకు మంగళమును దేసికేంద్ర సద్గురు చంద్రా.

గద్య ॥ అన్నమరాజవంశోద్భవుండు వెలివేర్తి సుగుణాకర
స్వాముల ప్రియశిష్యుండు నగు రంగారావుశర్మ వంశోద్భ
వుండు కౌండిన్యసగోత్రపరమపవిత్రుండు క ర ణ ము
తిమ్మయ్యాఖ్య సతీతిలక మగు నరసమాంబ గర్భ
జనిత పుత్రత్రయములో ప్ర థ మ పు త్రు ం
డయిన శివరామదాసుచే రచింపబడిన
దేశికేంద్రశతకము సంపూర్ణము.

శ్రీ అచలగురు చరణారవిందార్పణమస్తు

# తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 12 | పరమానందము | (ఒకటిమాత్రమే చదువుము) |
| 17 | 8 | తెలిపెనే | జేసెను |
| 18 | 16 | కంబారూరప్ప | కంబాలూరప్ప |
| 19 | 14 | తిలకాన్యయ | తిలకాన్వయ |
| 19 | 20 | వేగమి | వేగమె |
| 22 | 15 | తెలిరయును | తొలంగును |
| 22 | 24 | సిరమానఓకు | సిరమానవాకు |
| 23 | 22 | నమ్మితి | నమ్మితె |
| 25 | 13 | కామమంతా | కాయమంతా |
| 26 | 3 | త్రోలివేసి | త్రోసివేసి |
| 28 | 5 | ఈధరణి | యీధర |
| 28 | 17 | యిడుగవె | ఉడుగ్గవే |
| 29 | 12 | పలికె | పలికెవటి |
| 29 | 12 | లేదానరా | లేడానరా |
| 30 | 8 | రంగడ్ని | రంగన్ని |
| 35 | 11 | ఆవరించియి | ఆవరించియు |
| 35 | 19 | సురాజ | సురరాజ |
| 36 | 3 | పంచభూతముల | పంచభూతంబుల |
| 38 | 4 | దాసులి | దాసుల |
| 40 | 1 | చంచాలమునవైచ | చంచల మణచియు |
| 42 | 22 | ఖేదమోదము | ఖేదమోదము |
| 43 | 6 | మననవిది | మనవిది |
| 43 | 24 | పీడజేయుమ | పీడజేయుము |
| 48 | 14 | కరుణజేపి | కరుణజేసి |
| 50 | 20 | వాడ్ని | వానిని |
| 51 | 13 | నిమ్మితిరా | నమ్మితిరా |
| 51 | 16 | నిన్ను | నన్ను |
| 51 | 17 | నిన్ను | నన్ను |
| 51 | 20 | జెది | జెంది |
| 51 | 21 | యెరులేరు | యెవరులేరు |
| 53 | 18 | తల్లి | తలి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 54 | 5 | వన్నానురా | వున్నానురా |
| 54 | 14 | తలచి నేను | తలచి తలచి నేను |
| | | దాసుడు | దాసుని |
| 59 | 3 | సగమియ్యె | సగమయ్యె |
| 61 | 21 | వ్యాపించిన | వ్యాపించివున్న |
| 62 | 8 | మఘోషబాపు | మరి ఘోషబాపు |
| 62 | 21 | శంఖిని | శంఖినీ |
| 64 | 16 | చదరకనుండీ | చదరకను కనుడి |
| 65 | 3 | ౡా,ఎ,ఏ,ఐ,ఒ,ఓ | ౡ, ఏ, ఐ, ఓ |
| 66 | 14 | హారుడూడె | హారుడుండె |
| 66 | 15 | వేరు | పేరు |
| 66 | 21 | పద్యాసనస్థుడై | పద్మాసనస్థుడై |
| 67 | 11 | తగవు | తగను |
| 67 | 17 | నుంచిచూడ | నుంచి మరి చూడ |
| 68 | 12 | చెగి | చెలగి |
| 69 | 7 | గగనమదగును | గగనమం దగును |
| 70 | 21 | నీవంచు | నీ వంచును |
| 73 | 18 | నీవెకది | నీవెకద |
| 74 | 2 | రెండుగలవి | రెండుగలని |
| 75 | 7 | మందమందా | మందమందానంద |
| 78 | 4 | అనుకోతే | అనుకోనాతే |
| 82 | 25 | వాని | నాని |
| 86 | 26 | దేదాత | వేదాంత |
| 87 | 21 | కొడితోడపైన | వడితోడపైన |
| 88 | 17 | యిడనాడిచేతన | యిడనాడియును చేతను |
| 91 | 16 | గుడుడిల | గుటుడిల |
| 106 | 25 | అస్మిదసె | అస్మినసె |